తెలుగు అకాడమి ప్రచురణ - 137
మోనోగ్రాఫ్ (అనువాదశాస్త్రం)

# అనువాదశాస్త్రం



రచయిత
ఆచార్య భీంసేన్ నిర్మల్
ఎమిరటస్ ప్రొఫెసర్, హిందీశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు



తెలుగు అకాడమి
హైదరాబాదు
2000

# భూమిక

1968లో స్థాపన జరిగిన నాటి నుంచి ఉన్నత విద్యా స్థాయిలో బోధనభాషగా తెలుగు కుదురుకోడంలో తెలుగు అకాడమి నిర్వహిస్తున్న పాత్ర అందరికీ విశదమైందే. ఎన్నో రకాల ఇబ్బందులను అధిగమిస్తూ అత్యల్ప వ్యవధిలో ఇంటర్, డిగ్రీ, పి.జి. స్థాయి విద్యార్థులకు కావలసిన పాఠ్య పఠనీయ గ్రంథాలు; అనుబంధ గ్రంథాలుగా అనువాదాలు, మోనోగ్రాఫ్‌లు, జనరంజక గ్రంథాలు, వ్యాసావళులు, కరదీపికలు; ఎంసెట్, ఐ.ఐ.టి. మొదలయిన పోటీ పరీక్షలకు కావలసిన గ్రంథాలు; పారిభాషిక పదకోశాలు; శాస్త్ర నిఘంటువులు మొదలయిన వాటిని ప్రచురించి అకాడమి విద్యారంగానికి సముచితమయిన సేవ చేయగలిగింది. అకాడమి ప్రచురించిన పుస్తకాలు ఎన్నో పునర్ముద్రణలు కూడా పొందాయి.

ఉన్నత విద్యాస్థాయిలో విద్యార్థుల పరిశ్రమ కేవలం పాఠ్య పఠనీయ గ్రంథాలకు మాత్రమే పరిమితం కారాదని, ఆయా పాఠ్యాంశాల మీద విస్తృతాధ్యయనం అత్యావశ్యకమని విద్యావేత్తల అభిప్రాయం. ఈ స్థాయిలో విస్తృతాధ్యయనానికి ప్రామాణిక గ్రంథాలు విరివిగా అందించడం అకాడమి ధ్యేయం. ఈ దృష్టితోనే తెలుగు అకాడమి అనువాదశాస్త్రం అనే శాస్త్ర గ్రంథ ప్రచురణ పని చేపట్టింది. ఈ గ్రంథం తయారీలో పాల్గొన్న అకాడమి నిపుణులు :

డా॥ బి. విజయభారతి

డా॥ ఎ.మంజులత

డా॥ ఎం. ప్రమీలారెడ్డి

డా॥ ఎ.పాండయ్య

ఈ గ్రంథంవల్ల తెలుగులో శాస్త్రవిద్యాభ్యాసం చేసే విద్యార్థికీ శాస్త్రబోధనచేసే అధ్యాపకునికీ ఎంతో మేలు సమకూరగలదని మా విశ్వాసం. ఉన్నత విద్యలో తెలుగును బోధన భాషగా సుసంపన్నం చేయాలన్న కోరికతో శక్తివంచనలేకుండా మేం చేస్తున్న కృషి విజయవంతం కావడానికి మాకు ఎంతోమంది అండదండలు లభించాయి. వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం. ముందుముందు కూడా విద్యార్థులు, అధ్యాపకులు, విజ్ఞులు మాకు సహాయ సహకారాలను అందించగలరని ప్రగాఢంగా విశ్వసిస్తున్నాం.

# ప్రవేశిక

ప్రస్తుత యుగ పరిస్థితులలో అనువాద ప్రయోజనాన్ని, అవసరాన్ని గుర్తించి చాలా విశ్వవిద్యాలయాల్లో, ఇతర విద్యా సంస్థలలో అనువాదం పాఠ్యప్రణాళికలో ముఖ్య విషయంగా రూపుదిద్దుకొంటున్నది. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత భారతీయ భాషలకు ప్రాధాన్యం పెరగడంతో సాహిత్యానువాదాలకే కాక, సాహిత్యేతర విషయాలను ముఖ్యంగా పాలన యంత్రాంగానికి సంబంధించిన విషయాలను భారతీయ భాషల్లోకి అనువదించుకోవాల్సిన అవసరం ఏర్పడింది. దాంతో స్వచ్ఛందంగా-లాభాపేక్షలేకుండా-అనువాదం చేసే వారి కంటే, అనువాదాన్ని వృత్తిగా స్వీకరించి అనువాదం చేసేవారి సంఖ్య నానాటికీ పెరిగిపోతున్నది. అటువంటివారికి అనువాదాన్ని పాఠ్యాంశంగా బోధించి అనువాద శాస్త్రంలో నైపుణ్యాన్ని కలిగిస్తే వారు అనువాద కార్యక్రమాన్ని సమర్థవంతంగా నిర్వహించగలుగుతారు.

అనువాద సిద్ధాంతాలను గురించిన గ్రంథాలు ఇంగ్లీషులో ఎక్కువగా ప్రచురితమయ్యాయి. అధికారభాషగా కేంద్ర ప్రభుత్వ గుర్తింపు పొందిన తర్వాత హిందీ భాషలో కూడా అనువాద సిద్ధాంత ప్రయోగాలను గురించి చాలామంది పుస్తకాలు రాశారు. తెలుగులో కీ.శే. రాచమల్లు రామచంద్రారెడ్డిగారు తెలుగు-ఇంగ్లీషు అనువాద సందర్భంగా ఎదురైన, ఎదురయ్యే సమస్యలను విశ్లేషిస్తూ అనువాదకులకు ఉపయోగకరంగా ఉండే విధంగా 'అనువాద సమస్యలు' (1987) అన్న పుస్తకం రాశారు. అనువాదం చేసేవారికి ఉపయోగకరంగా ఉండే విధంగా శ్రీ గోవిందరాజు చక్రధర్‌గారు 1998లో 'అనువదించడం ఎలా?' అనే పుస్తకం రాశారు. ఈ పుస్తకంలో అనువాదాన్ని గురించి సుప్రసిద్ధులైన వ్యక్తులతో ఇంటర్వ్యూలు, సుప్రసిద్ధ పాత్రికేయులైన పొత్తూరి వెంకటేశ్వరరావుగారి అభిప్రాయాలు ఉటంకిస్తూ అనువాద స్వరూపాన్ని విశ్లేషిస్తూ సోదాహరణంగా అనువాద ప్రాధాన్యాన్ని వివరించారు. అవి చక్కటి రిఫరెన్స్ గ్రంథాలు.

దాదాపు నలభైఏళ్ళ నుంచి అనువాదాలు చేస్తూ గత పాతిక సంవత్సరాలుగా అనువాద శాస్త్రాన్ని పాఠ్యాంశంగా బోధిస్తూ వచ్చిన నాకు అనువాదశాస్త్రాన్ని గురించి తెలుగులో పుస్తకం రాయడానికి ప్రేరణ కల్గించిన డా. ముకురాల రామారెడ్డి గారికి నా కృతజ్ఞతలు.

రచనా కార్యక్రమంలో నిరంతరం నాకు సహకారం అందిస్తున్న చిరంజీవి డా. యన్.వి. యస్. ప్రసాదుకు ఆశీస్సులు.

ఈ పుస్తకం అనువాదకులకు, అనువాదశాస్త్రం అభ్యసించే విద్యార్థులకు ఉపకరిస్తుందని ఆశిస్తున్నాం.

# విషయసూచిక

# 1

# అనువాదం- విషయప్రవేశం

'అనువాదం' అనే పదం 'వద్' ధాతువుకు సంబంధించినది. 'వద్' అంటే 'చెప్పడం' అని అర్థం. 'వద్' ధాతువుకు 'ఘఞ్' ప్రత్యయం చేర్చడం వల్ల 'వాద్' అనే పదం, దానికి 'అను' అనే ఉపసర్గ చేర్చడంవల్ల 'అనువాద' అనే పదం ఏర్పడుతుంది. అంటే అనువాదం అనే పదానికి 'పునఃకథనం', ఒకరు చెప్పినదాన్ని మళ్ళీ చెప్పడం అని అర్థం. 'శబ్దార్థ చింతామణి' అనే నిఘంటువులో అనువాదానికి 'ప్రాప్తస్యపునఃకథనే' లేదా 'జ్ఞాతార్థస్య ప్రతిపాదనే' అని అర్థం చెప్పారు.

వైదిక సంస్కృతంలో 'అను', 'వద్' పదాలు వేరువేరుగా ఉపయోగించినా 'అనువదతి' అనే పదానికి అర్థం-'మళ్ళీ చెప్పడం' అనే. ప్రాచీన సంస్కృత సాహిత్యంలో 'గుణానువాదం' అనే పదం కూడా కనిపిస్తుంది. 'గుణానువాదం' అంటే గుణాలను మళ్ళీమళ్ళీ చెప్పడం.

ఈ విధంగా వైదిక సంస్కృతంలోనూ లౌకిక సంస్కృతంలోనూ అనువాదం అంటే 'పునఃకథనం' (మళ్ళీ మళ్ళీ చెప్పడం) అనే అర్థం రూఢమైపోయింది. అయితే ఆధునిక కాలంలో 'అనువాదం' అనే పదానికి తర్జుమా, Translation అనే అర్థాలు రూఢమైపోయాయి. అంటే ఒక భాషలో చెప్పిన విషయాన్ని మరో భాషలో చెప్పడం అనేదే 'అనువాదం' అనే పదానికి రూఢార్థమైంది.

ఇంగ్లీషులో ఉన్న Translation అనే మాట Latin లోని Trans, lation అనే పదాల కూడికతో ఏర్పడింది. Trans అంటే అవతలి ఒడ్డు, lation అంటే తీసుకొని వెళ్ళే పని. అంటే 'పారవహన్' (ఈ ఒడ్డునుంచి ఆవలి ఒడ్డుకు తీసుకొని వెళ్ళడం)అని అర్థం.Translation కి పర్యాయవాచక పదాలుగా French భాషలో Traduction, అరబ్బీ భాషలో తర్జుమా అనే పదాలు ప్రచారంలో ఉన్నాయి. తెలుగులో అనుసృజన, పునఃసృజన అనే పదాలు కూడా అనువాదానికి పర్యాయాలుగా వాడుతున్నారు.

Translation మీద ఆధారపడినవే Transcription, transliteration, transcreation, transformation మొదలయినవి.

భాష కొన్ని ప్రతీకల (symbols) సమాహార స్వరూపం. ఒక భాషలోని ప్రతీకలకు

బదులుగా ఇంకో భాషలోని ప్రతీకలను వాడటాన్ని 'ప్రతీకాంతరీకరణం' అంటారు. ఒక భాషలో వాడుకలో ఉన్న ఒక పదానికి బదులు, ఇంకో భాషలోని ఇంకొక పదాన్ని వాడటాన్నే పదాంతరీకరణం అని, మాధ్యాంతరీకరణం అని, భాషాంతరీకరణం అని అంటారు. నిజానికి ఒక భాషలో చెప్పిన విషయాన్ని లేదా అభిప్రాయాన్ని మరో భాషలో వ్యక్తీకరించడమే అనువాద మూలకార్యం. మూల (source) భాషలో చెప్పిన విషయాన్ని లక్ష్య (target) భాషలో అభివ్యక్తీకరించడమే అనువాదం. ప్రతిభాషలో అభిధార్థం, లక్ష్యార్థం, వ్యంగ్యార్థం ఉంటాయి. వీటిని చక్కగా అర్థంచేసుకొని, వాటిని తదనుగుణంగా లక్ష్యభాషలో అభివ్యక్తీకరించడమే అనువాదం. కాబట్టి అనువాదంలో మూలభాషలోని భావాన్నీ రచయిత వాడిన విశిష్ట పద ప్రయోగశైలినీ చక్కగా ఆకళింపుకు తెచ్చుకుని, అదేవిధంగా లక్ష్యభాషలో ఆ భావాన్ని అభివ్యక్తీకరిస్తూ, ఆ విశిష్టపద ప్రయోగశైలిని వాడాలి.

ఒక భాషలో అభివ్యక్తీకరించిన భావాలను, అభిప్రాయాలను వీలయినంతమటుకు సమానంగాను, లక్ష్యభాష స్వభావానికి అనుకూలంగానూ అభివ్యక్తీకరించే ప్రయత్నమే అనువాదం[1] అని ఇ.ఎ.నైడా నిర్వచించాడు. డా. భోలానాథ్ తివారి గారు ముఖ్యంగా రెండు విషయాలు అనువాదానికి తప్పనిసరి అని చెప్పారు. మొదటిది మూలభాషలో వ్యక్తీకరించిన భావాలు, అభిప్రాయాలు, పదప్రయోగాలు మొదలయిన వాటికి లక్ష్యభాషలో వీలయినంత మటుకు సమానత్వంగల భావాలు, అభిప్రాయాలు, పదప్రయోగాలు వాడాలి. రెండోది లక్ష్యభాషకు ఉండే సహజమైన శైలిలో అనువాదం సాగాలి.

ఇప్పుడు అనువాదాన్ని గురించి ప్రాచ్య పాశ్చాత్యవిద్వాంసులు చెప్పిన కొన్ని నిర్వచనాలను గమనిద్దాం. సంస్కృతంలోగాని, ఇతర భారతీయ భాషల్లోగాని ఈనాటి మాదిరిగా ఆనాడు అనువాదానికి ఏమాత్రం ప్రాధాన్యం లభించలేదు. మూల గ్రంథాలకు వాఖ్యానాలుగానూ లేదా టీకా తాత్పర్యాలుగానూ రాసిన గ్రంథాలేకాని అనువాదాలు అని చెప్పకోదగ్గ గ్రంథాలు లేవు. పూర్వీకులు భావానువాదాలు, స్వేచ్ఛానువాదాలు చేశారేతప్ప మక్కీకి మక్కీ అనువాదాలు చేయలేదు. కాళిదాసు రచనలకు 'సంజీవనీ వ్యాఖ్య' రాసిన మల్లినాథ సూరి 'నా మూలం లిఖ్యతే కించిన్నానపేక్షితముచ్యతే'అని అన్నాడు. కాని అది తన వ్యాఖ్యాన పద్ధతిని గురించి చెప్పిందే తప్ప అనువాదం గురించి చెప్పింది కాదు. కాళిదాసు రచనలను క్షుణ్ణంగా అర్థంచేసుకొన్న మల్లినాథుడు తన వ్యాఖ్యానాలద్వారా కాళిదాసును పునరుజ్జీవింపచేశాడు. మల్లినాథుడు రాసినవి వ్యాఖ్యాన గ్రంథాలే కాని అనువాదాలు కావు అన్న విషయం సుస్పష్టం. బృహత్కథ

1. The theory and practice of Translation - Nida Éugene A. Page -13
Translation consists in producing in the receptor language the closest natural equivalent to the message of the source language, first in meaning and secondly in style.
2. అనువాద విజ్ఞాన్ - డా. భోలానాథ్ తివారి - పేజీ 17

మొదలైన రచనలకు సంస్కృతంలో వచ్చిన రచనలు భావానువాదాలు లేదా ఛాయానువాదాలేతప్ప శబ్దానువాదాలు కావు. సంస్కృతంలోని నీతి గ్రంథాలను, వైద్య గ్రంథాలను, నాటకాలను ఆయా కవులు, పండితులు తమతమ భాషల్లో రాసినా అవి అనువాదాలుగాకాక మౌలిక రచనలుగానే భాసిస్తున్నాయి. కాబట్టి వీరెవరూ అనువాదం, అనువాద సిద్ధాంతాలు మొదలయిన వాటిని గురించి సశాస్త్రీయంగా చర్చించలేదు. వారికి ఆ అవసరంకూడా కలగలేదు.

ఆధునికకాలంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు మొదలయినవారు సంస్కృత, ఆంగ్ల భాషలనుంచి అనువాదాలు చేసినా బెంగాలీ, హిందీ, గుజరాతీ భాషలనుంచి తెలుగులో ఎన్నో అనువాదాలు వచ్చినా ఆ అనువాదకులెవరూ సిద్ధాంతపరంగా అనువాదాన్ని గురించి చర్చించలేదు. స్వాతంత్ర్యానంతరం అనువాదాల సంఖ్య పెరిగి అనువాద సిద్ధాంతపరంగా విస్తృతంగా చర్చలు జరిగాయి, జరుగుతున్నాయి. మొత్తంమీద ఈ రంగంలో హిందీ భాషలో వచ్చినన్ని పుస్తకాలు మరే భాషలోనూ రాలేదు. దానికి కారణం విశ్వవిద్యాలయ స్థాయిలో చాలా చోట్ల అనువాదం ప్రత్యేక విషయంగా పాఠ్యక్రమంలో చోటు చేసుకోవడమే. 1987లో రాచమల్లు రామచంద్రారెడ్డిగారు 'అనువాద సమస్యలు' అనే పుస్తకం రాసి అనువాద సిద్ధాంతం గురించి చర్చించారు. గోవిందరాజుల చక్రధర్‌గారు 1998లో 'అనువదించటం ఎలా?' అనే పుస్తకం ప్రచురించారు. అయితే ఈ రెండు పుస్తకాలు అనువాద సమస్యల గురించి వ్యావహారికంగా చర్చించిన గ్రంథాలుమాత్రమే. వీరిద్దరూ అప్పటివరకు వచ్చిన అనువాదాల్లో దొర్లిన పొరబాట్ల పట్ల మాత్రమే తమ దృష్టిని సారించారు. అయితే ఈ పుస్తకాల్లో గతానుగతికంగా కొన్ని సైద్ధాంతిక విషయాలను గురించి ఉటంకించడంకూడా జరిగింది.

అనువాద గ్రంథాలకు రాసిన పీఠికల్లో సందర్భానుసారంగా కొంతమంది అనువాద సిద్ధాంత సమస్యలను గురించి చర్చించారు. వీటిల్లో ముఖ్యంగా చెప్పుకోవాల్సింది చివుకుల పురుషోత్తంగారి 'ఏదిపాపం?' అనే నవలకు శ్రీ సూర్యనాథ్ ఉపాధ్యాయగారు చేసిన 'క్యాహై పాప్'[1] అనే అనువాదానికి శ్రీ పి.వి. నరసింహారావుగారు (తెలుగు అకాడమి ప్రథమ అధ్యక్షులు, మాజీ ప్రధాని)రాసిన భూమిక చెప్పుకోతగ్గది.

यह सत्य है कि किसी भी कुशल अनुवादक के लिए मूलभाषा और अनुवाद भाषा दोनों पर लगभग समान अधिकार रखना नितांत आवश्यक होता है। तथापि यह भी उतना ही सत्य है कि भाषा पर अधिकार के होने भर से अभिव्यंजकता एवं प्रचलित मुहावरे और बोली की चुस्ती में कुशलता प्राप्त करना आप ही आप संभव नहीं हो

1. క్యాహైపాప్-అను. శ్రీ సూర్యనాథ్ ఉపాధ్యాయ - పేజీ 11, 12

जाता। यही कारण है कि कई अन्यथा अच्छे अनुवाद भी अनुवाद के भाषा–भाषी क्षेत्र में सफल एवं लोकप्रिय हो नहीं पाते। भारतीय अनुवादकों के अंग्रेजी अनुवादों की अंग्रेजी–भाषी देशों में अक्सर यही स्थिति होती देखी जाती है। भारतीय भाषाओं के बीच किए गए अनुवादों में सांस्कृतिक एवं वस्तुगत एकसूत्रता अवश्य होती है अत: वे इतने अजनबी या अटपटे नहीं लगते। तथापि अनुवाद की भाषा के सम्यक ज्ञान के साथ–साथ लगातार उस भाषा के क्षेत्रीय स्वरूप से संपर्क जहाँ अनुवादक का नहीं होता, वहाँ उसके अनुवाद में स्वाभाविकता एवं प्रभावोत्पादकता की कुछ कमी–सी आ जाती है।

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన Popular series లో అరణ్యపర్వానికి తాము రాసిన పీఠికలో డా. పాటిబండ మాధవశర్మగారు తెలుగు కవులు అనుసరించిన అనువాద విధానాన్ని గురించి విపులంగా చర్చించారు.

'సంక్షేపించడం, అన్యథాకరించడం, పరిహరించడం, నూత్నంగా కల్పించడం' ఇవి నన్నయ ఆంధ్రీకరణ లక్షణాలు. ఇలా చేయడానికి గల కారణాలను వివరిస్తూ డా. మాధవశర్మగారు తమ అభిప్రాయాన్ని ఇలా వెలిబుచ్చారు. 'సంక్షేపించుట, పరిహరించుట కథకు నిబిడత్వము, కథనమునకు ప్రౌఢత్వము సంపాదించుటకు, విస్తరించుట, కల్పించుట రసభావముల పోషణకు, అన్యథాకరించుట ఔచిత్యమునకు, ఇతిహాసమును కావ్యముగా రూపొందించుటకు ఈ విధానము సర్వథా యోగ్యమైయున్నది.' (శ్రీ ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-సంపాదకులు-డా. పాటిబండ మాధవశర్మ: పేజీ నెం. 16-17)

పైన డా. శర్మగారు చెప్పిన పద్ధతులను దాదాపు తెలుగు కవులందరూ అనుసరించారు. ఇది కేవలం తెలుగులోనే కాదు, తమిళంలో కంబర్, కన్నడంలో పంపకవి, మళయాళంలో ఎఘుతచ్చన్, హిందీలో గోస్వామి తులసీదాసు, వంగభాషలో కృత్తివాసకవి మొదలయిన వారందరూ ఈ పద్ధతులనే అనుసరించారు. ఉమర్ ఖయ్యాం రుబాయిలను అనువదించి, ప్రపంచ ప్రఖ్యాతి పొందిన Fitzerald అనే కవి కూడా ఈ విధానాన్నే అంటే మూలంలోని భావాన్ని గ్రహించి, దానితో తన మౌలిక ప్రతిభను జోడించి, తన అనువాదాలను మౌలిక అనుసరణలుగా-పునఃసృష్టిలా-రూపొందించాడు. ఫిట్జ్‌రాల్డు 'I am persuaded that the translator must recast the original into his own likeness-better a live sparrow than a stuffed eagle' అని అన్నాడు.

పాశ్చాత్యదేశాల్లో అనువాద సిద్ధాంత పరమైన చర్చలు ప్రాచీనకాలం నుంచే జరుగుతూ వచ్చాయి. 'A translator is a traitor అనే నానుడి గ్రీకు భాషలో ప్రచారంలో ఉండేది అంటే అనువాదకుడు మూలం పట్ల సరిగా న్యాయం చేయలేదని తాత్పర్యం. ఇంకో ఫ్రెంచ్

విద్వాంసుడు 'If the translation is faithful, cannot be beautiful. If it is beautiful, it cannot be faithful' అన్నాడు. అంటే మూలంలో ఉన్న భావం, శైలీ సౌందర్యాన్ని లక్ష్యభాషలో తేవటానికి ప్రయత్నిస్తే మూలానికి Faithful గా ఉండదని, మూలానికి Faithful గా ఉండాలని ప్రయత్నిస్తే beautiful గా ఉండదని తాత్పర్యం. ఈ faithful, beautiful అనే శబ్దాలు ఆధారంగా పాశ్చాత్య దేశాల్లో అనేకానేక చర్చలు జరిగాయి. పుస్తకాలు వెలువడ్డాయి. వాటిల్లో కొన్నిటిని గురించి తెలుసుకుందాం.

ప్రపంచంలో చాలామంది అనువాదకులు, విద్వాంసులు నైడా (Nida) నిర్వచనాన్ని అంగీకరించారు. ఆయన ఇలా అన్నాడు.

(1) 'Translating consists in producing in the receptor language the closest natural equivalent to the message of the source language, first in meaning and secondly in style' - Nida

మూల భాషలోని విషయాన్ని లక్ష్యభాషలో వీలయినంతమటుకు సమానంగానూ, సహజంగానూ ఉండేట్లు అభివ్యక్తీకరించడమే అనువాదం. అయితే నైడా తాత్పర్యానికి (భావానికి) ప్రథమ స్థానమిచ్చి, శైలికి రెండోస్థానమిచ్చాడు. అంటే మూలరచనలోని విషయాన్ని (content or matter) తప్పనిసరిగా లక్ష్యభాషలో అనువదించాలి. ఆ తరవాతే శైలి (Manner) కి స్థానం.

(2) The replacement of textual material in one language by equivalent textual material in another language - Catford

మూలరచనలోని పాఠ్యసామగ్రిని సరిసమానమయిన పాఠ్యసామగ్రిగా లక్ష్య భాషలో అభివ్యక్తీకరించాలి. అంటే అభివ్యక్తిశైలి కంటే, మూలరచనలోని భావానికి ప్రాధాన్యమిస్తూ, మూలభావాన్ని సరైన విధానంలో అనువదించాలని క్యాట్‌ఫోర్డు అభిప్రాయపడ్డాడు.

(3) Translation is the transference of the content of a text from one language into another, bearing in mind that we cannot always disasociate the Content from the form - Forester.

విషయాన్నీ శైలినీ ఎప్పుడూ వేరు చేయలేమనే విషయాన్ని మనస్సులో ఉంచుకొని ఒక భాషలో చెప్పిన విషయాన్ని మరో భాషలోకి మార్చడమే అనువాదం అని ఫారెస్టర్ అభిప్రాయం. విషయానికీ శైలికీ అవినాభావ సంబంధముంటుంది. అందుచేత అనువదించేటప్పుడు భావాన్నే కాక, ఆ భావాన్ని అభివ్యక్తీకరించిన శైలి కూడా లక్ష్యభాషలో ప్రస్ఫుటంకావాలి.

(4) To interpret in another language; to change into another language, retaining the sense - Samuel Johnson.

మూలరచనలోని భావాన్నీ, తాత్పర్యాన్నీ రక్షించుకుంటూ, ఒక భాషలోని రచనను మరో భాషలో వ్యాఖ్యానించడమే అనువాదం అని చెప్పి సామ్యూల్ జాన్సన్ అనువాదంకంటే వ్యాఖ్యకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చాడు.

(7) Translation is a craft consisting in the attempt to replace a writers message and / or statement in one language by the same message and/or statement in another language -Peter Newmark.

ఒక భాషలోని సందేశాన్ని కానీ, భావాన్నికానీ మరో భాషలో అదేవిధంగా అభివ్యక్తీకరించ డానికి చేసే నేర్పు అని అనువాద ప్రక్రియను పీటర్ న్యూమార్క్ నిర్వచించాడు. అనువాదాన్ని 'శిల్పం' అని అభివర్ణిస్తూ, న్యూమార్క్ message/statement-భావానికే ఎక్కువ ప్రాధాన్యమిచ్చాడు. మూలరచయిత చెప్పిన భావాన్నే యథాతథంగా లక్ష్య భాషలో అభివ్యక్తీకరించాలని న్యూమార్క్ అభిప్రాయపడ్డాడు.

(8) A translation should effect us in the same way as the original may supposed to have effected its first reader - Mathew Arnold.

మూల భాషలోని పాఠకులను ప్రభావితం చేసిన విధంగానే అనువాదం కూడా లక్ష్యభాష లోని పాఠకులను ప్రభావితం చేయాలని మేథ్యూ ఆర్నాల్డ్ అభిప్రాయం. The union of the translator with its original, which also can produce a good translation, takes place when the mist which stands between them- the mist of the alien modes of thinking, speaking and feeling on the translator's part, defecates to a pure transperancy and disappears. మూల రచయితతో, రచనతో అనువాదకుడు తాదాత్మ్యం పొందినపుడు, అతడు చేసే అనువాదం పారదర్శకమై, మూలంమాదిరిగానే ప్రభావయుక్తంగా ఉంటుంది.

అనువాదప్రక్రియ ఒక రకంగా పరకాయ ప్రవేశం లాంటిది అని చెప్పవచ్చు. భావం, విషయం (content, matter) ఆత్మలాంటిది అయితే అభివ్యక్తిశైలి (manner) శరీరం లాంటిది. అనువాదం అంటే ఒక భాషలోని ఆత్మను ఇంకో భాషలోకి ప్రవేశపెట్టడం. ఆత్మ మూలభాషదయితే శరీరం లక్ష్య భాషది. ఆ ఆత్మ ఈ శరీరంలో ఎంత చక్కగా ఇమిడిపోతే, అనువాదం అంత స్వాభావికంగా ఉంటుంది. నైడా చెప్పినట్టు closest natural equivalent గా ప్రతిభాసిస్తుంది.

అలెగ్జాండర్ ఫ్రేజర్ టిట్లర్ అనువాదకళను గురించి చెబుతూ, ప్రధానంగా మూడు సూత్రాలను ఉటంకించాడు[1].

1. (Alexander Fraser Tytler (Lord woodhouselee) Essay on the Principles of Translation (1791)

1. మూల రచనలోని భావాలన్నీ లక్ష్యభాషలో వ్యక్తంకావాలి.

2.మూల రచనలోని శైలీ వైశిష్ట్యమంతా అనువాద రచనలో రావాలి. మూల రచనాశైలికి, రచనా విధానానికి, లక్ష్య భాషలోని శైలికి, రచనా విధానానికి సారూప్యం ఉండాలి. అంటే మూలంలో ఎలా ఉన్నదో, అనువాదంలోకూడా అలానే ఉండాలి.

3.మూలంలో ఉన్నదాన్నే చెప్పాలి. మూల భావాన్ని మార్చే, వదలివేసే లేదా ఇంకేదైనా జోడించే అధికారం అనువాదకుడికి లేదు. అంటే అనువాదం నూటికి నూరుపాళ్ళు మూలవిధేయంగా ఉండేటట్లు అనువాదకుడు ప్రయత్నం చేయాలని టిట్లర్ సిద్ధాంతం.

అనువాద సిద్ధాంతాలను గురించి విశిష్టంగా విశ్లేషించిన టి.హెచ్.సేవరీ అనే విద్వాంసుడు పరస్పరం విరుద్ధంగా తోచే తన అభిప్రాయాలను ఈ విధంగా వెలిబుచ్చాడు [1]

1. A translation must give the words of original (మూలంలోని పదాలను వాడాలి) అంటూనే A translation must give the ideas of the original (మూలంలోని అభిప్రాయాలను, భావాలను అనువాదం వ్యక్తీకరించాలి) అని అంటాడు.

2. A translation should read like an original work (అనువాదం మూల రచనలాగా భాసించాలి) అంటూనే A translation should read like a translation (అనువాదం అనువాదంలాగానే అనిపించాలి) అని అంటాడు.

3. Translation should reflect the style of original (మూలరచన శైలి అనువాదంలో ప్రతిబింబించాలి) అంటూనే Translation should reflect the style of the translation (అనువాదం అనువాదశైలిని ప్రతిబింబించాలి) అని అంటాడు.

4. A translation should read as contemporary of the original (అనువాదం మూల రచనకు సమకాలీనంగా భాసించాలి) అంటూనే A translation should read as contemporary of the translation (అనువాదం చేసే కాలానికి సమకాలీనంగా ఉండాలి) అని అంటాడు.

5. A translation may add or omit from the original (మూలరచనలోని కొన్నింటిని అనువాదంలో విడిచిపెట్టవచ్చు లేదా కొన్నింటిని జోడించవచ్చు) అని అంటూనే A translation may never add or omit from the original (మూలంలోని ఏ విషయాన్నీ ఏమాత్రం విడిచిపెట్టడం కాని జోడించడంకాని చేయకూడదు) అని అంటాడు.

6.A translation of verse should be in verse (పద్యానువాదం పద్యంగానే ఉండాలి) అంటూనే A translation of verse should be in prose (పద్యానువాదం

2. The Art of Translation-T.H.Savory

గద్యంలోనే ఉండాలి) అని అంటాడు.

పై ఆరు సిద్ధాంతవాక్యాలను పరిశీలిస్తే, అనువాదం ఎలా ఉండాలి అన్న విషయం గురించి ఇదమిత్థంగా చెప్పలేమన్న విషయం స్పష్టమవుతుంది. అనువాద ప్రక్రియలో అనువాదకుడి ప్రతిభ, వ్యక్తిత్వం, ఉద్దేశించిన పాఠకుల స్థాయి మొదలయినవాటికి విశిష్టస్థానముంటుంది. అందుచేత ఏ ఒక్క విద్వాంసుడు నిర్వచించిన విధంగా కాకుండా, ఈ విభిన్న అభిప్రాయాలను క్రోడీకరించుకొని, ప్రతి అనువాదకుడు తన అనువాద పద్ధతిని రూపొందించుకోవాలి.

రష్యన్ భాషా విద్వాంసుడు, సుప్రసిద్ధ అనువాదకుడు అయిన శ్రీ యం.పి.పాండేగారు Inspite of such conflicting and often diametrically opposite points of view, most of the theoreticians agree that a perfect translation should convey the spirit of the original author by giving us the words that he would have used it he had been using the language into which his reading were being translated[1]. అన్నారు. పరస్పర విరుద్ధంగా ఉన్న సిద్ధాంతాల సారాంశాన్ని ఇలా చెప్పుకోవచ్చు. సరైన అనువాదం మూల రచయిత భావాన్ని పరిపూర్ణంగా వ్యక్తీకరించాలి. మూలరచయితే లక్ష్యభాషలో రాసి ఉంటే, ఎలా ఉండేదో అనువాదంలో శైలి, పదప్రయోగాలు అలానే ఉండాలి అని పాండేగారి అభిప్రాయం.

అనువాద విషయంలో మౌలికమైన సమస్యలు ఒకేవిధమైనవే కానీ, నిర్వచనాలు మాత్రం వేరువేరుగా ఉన్నాయి. పైన చెప్పిన నిర్వచనాలన్నింటిని సమగ్రంగా ఆకళింపు చేసుకుంటే అనువాదం ముఖ్యంగా భావపరంగా ఆ తరవాత శైలీపరంగా వీలయినంతమటుకు సమతుల్య సహజ భాషా ప్రతీకలను వాడుతూ, మూలభాషలోని భావ సౌందర్యాన్నీ శైలీ సౌందర్యాన్నీ లక్ష్యభాష పాఠకుడికి అందించడానికి శాయశక్తుల ప్రయత్నం చేయాలి. ఇదే అనువాద సాఫల్యానికి కొలమానం.

సుప్రసిద్ధ విమర్శకులు, 'అనువాద సమస్యలు' అనే పుస్తకం రాసిన కీ.శే. రాచమల్లు రామచంద్రారెడ్డిగారు 'మూలభాష మాతృభాషగా గలవానికి మూలరచనలోని సారాంశం ఎంత స్పష్టంగా అర్థమై, ఎంత గాఢమైన అనుభూతిని కలిగిస్తుందో లక్ష్య భాష మాతృభాషగా గలవానికి అనువాదంలోని సారాంశం అంత స్పష్టంగానూ అర్థమై, అంతగాఢమైన అనుభూతిని కలిగిస్తే అది మంచి అనువాదం అవుతుందని అన్నారు. (పేజీ 71)

---

1. The problems of translation - సం.ప్రా. జి. గోపీనాథన్ - పేజి 20

# 2

# అనువాద సంప్రదాయం-వివేచన పద్ధతులు

వైదిక, లౌకిక సంస్కృత వాఙ్మయంలో అనువాదమనే పదానికి 'జ్ఞాతస్యపునఃకథనమ్' అనే అర్థమే ఎక్కువగా వాడుకలో ఉన్నట్లు లోగడ చెప్పుకున్నాం . దీనిమీద ఆధారపడిన పదాలే భూతార్థానువాదం, స్తుత్యర్థానువాదం, గుణానువాదం మొదలైనవి. అయితే పూర్వకాలంలో Translation అనే అర్థంలో అనువాదపదం వాడినట్లుగా కనిపించదు. ఆధునిక భారతీయ భాషలు బాగా ప్రచారంలోకి రావటానికి ముందు సంస్కృత భాషే సమస్త భారతదేశానికి సార్వదేశిక (Lingua–Franca) అనుసంధాన (link) భాష కావడంతో ఆ భాషలో రాసిన వివిధ విషయాలకు సంబంధించిన గ్రంథాలను ఆనాటి విద్వాంసులు నేర్చుకునేవారు. ఏదైనా విషయాన్ని గ్రహించినా దాన్ని సాకల్యంగా అర్థం చేసుకొని స్వయంగా తమదైన శైలిలో స్వతంత్ర గ్రంథాలు రాశారేతప్ప వాటిని అనువదించలేదు.

పైశాచి ప్రాకృతంలో గుణాఢ్యుడు రాసిన 'బడ్డకహ' (బృహత్కథ) కు రెండో మూడో అనువాదాలవంటి అనుసరణాత్మక కావ్యాలు కనిపించినా వాటిని అనువాదాలు అనడానికి వీలులేదు. క్షేమేంద్రుడు (బృహత్ కథామంజరి), బుద్ధస్వామి (బృహత్ కథా శ్లోక సంగ్రహః) సోమదేవ్ (కథాసరిత్సాగరం) ఈ మూడు గ్రంథాలు బృహత్కథను అనుసరించి రాసినవే కాని వీటిని అనువాదాలనడానికి వీలులేదు.

గుప్తుల కాలం కంటే ముందు ప్రాకృత సాహిత్యం బాగా ప్రచారంలో ఉండటంతో ప్రాకృత జైన గ్రంథాలను సంస్కృతంలోకి అనువదించడం జరిగింది. కాని ఆ అనువాదాలను కూడా ఛాయానువాదాలనే అన్నారు.

ప్రాచీన కాలంలో అనేకమైన దేశ విదేశ భాషల్లో అనేక సంస్కృత గ్రంథాలను అనువదించారు. బైబిల్కంటే ముందే అనేక విదేశ భాషల్లోకి అనువదించిన, అనుసరించిన ఏకైక గ్రంథం 'పంచతంత్రం' అనే చెప్పవచ్చు.

పాళీభాషలో కూడా ఇతర భాషలనుంచి అనువదించుకున్న సాహిత్యం ఎక్కువగా కనిపించదు. మనుస్మృతి లాంటి గ్రంథాలను పాళీభాషలోకి అనువదించారు. కాని పాళీభాషలో సుప్రసిద్ధమైన 'ధమ్మపదం' వంటి గ్రంథాలను సంస్కృతం, చైనా, టిబెట్, జపాన్ భాషల్లోకి

అనువదించారు. కాని అవి మూలనిష్ఠమైన అనువాదాలు కావు. ఇదే విధంగా ప్రాకృత, అపభ్రంశ భాషల గ్రంథాలను కూడా ఇతర భాషలలోకి అనువదించారు.

ఆ తరవాత సంస్కృతంలోని అనేక గ్రంథాలను, కావ్యాలను, నాటకాలను ఆయా ప్రాంతీయ భాషల్లోకి అనువదించడం జరిగింది. అయితే ఈ అనువాదాలను శాస్త్రీయ దృష్టితో అనువాదాలు అనడానికి వీలులేదు. ఎందుకంటే ఇవి అనువాదాలు కావు, మౌలిక అనుసరణలు మాత్రమే.

క్రీ.శ. 10, 11 శతాబ్దాలకు ముందు మనదేశంలో ద్విభాషాసూత్రం ప్రచారంలో ఉండేది. ఆయా రాష్ట్రాలలో అక్కడి ప్రాంతీయ భాషలు వికసించసాగాయి. సంస్కృత భాష విద్వాంసుల భాషగా, సార్వదేశిక భాషగా (Lingua franca) ప్రచారంలో ఉండేది. అందుచేత ఆయా ప్రాంతాలకు చెందిన విద్వాంసులు, కవులు సంస్కృత సాహిత్య భాండాగారాన్ని తమ తమ భాషల్లో అందుబాటులోకి తీసుకొనిరావడానికి ప్రయత్నాలు చేశారు. వాల్మీకి రచించిన రామాయణాన్ని అనేక భారతీయ భాషల్లో అనుసరణాత్మక కావ్యంగా రూపొందించుకోడానికి ఇదే కారణం అని అనిపిస్తుంది.

ఇలాంటి రూపాంతరీకరణలు, అనుసరణలు, అనుసృజనలు లక్ష్య భాషకు అనుగుణంగా ఉండి, పాఠకులు మూలగ్రంథాల భావసౌందర్యాన్ని గ్రహించి, రసాస్వాదన చేయడానికి అవకాశం కల్పించాయి.

పాశ్చాత్య దేశాల్లో క్రీస్తుకు మూడువేల సంవత్సరాల పూర్వం అసీర్యా దేశపు రాజైన శారగోన్ (Sargon) అనేక భాషా ప్రాంతాలతో కూడిన తన సామ్రాజ్యంలో తన శౌర్య సాహసగాథలను గురించి అనేకానేక భాషల్లో ప్రకటన పత్రాలు జారి చేయించాడట. వీటిని మొదట అసీరియన్ భాషలో రాసేవారు. ఆ తరవాత వాటిని ఆయా భాషల్లో అనువదింపచేసేవారు. ఒక పద్ధతి ప్రకారంగా జరిగిన అనువాధ కార్యక్రమానికి బహుశ ఇది మొదటి తార్కాణం కావచ్చు.

క్రీస్తుకు పూర్వం 21వ శతాబ్దిలో హమ్మూరబి (Hammurabi) కాలంలో బాబిలోన్ అనే నగరంలో వివిధ భాషలు మాట్లాడేవారు ఉండేవారట. ఆ మహారాజు ప్రజలు సులభంగా అర్థంచేసుకోడానికి వీలుగా ఆజ్ఞాపత్రాలను, ప్రకటన పత్రాలను ఆయా భాషల్లో అనువదింపచేసేవాడట. ఈ విధమైన అనువాదకుల కోసం నిఘంటువులు కూడా తయారుచేశారట. ఈ నిఘంటువులలో క్యూనిఫామ్ లిపిలో, ఇటుకలమీద రాసిన కొన్ని భాగాలు కూడా దొరికాయి. క్రీస్తుకు పూర్వం 4, 5 శతాబ్దాలకాలంలో యూదులలో సాముహికంగా ధర్మప్రవచనాలు చేసే పరిపాటి ఉండేది. వీటిని మనదేశంలోని పురాణ కాలక్షేపాలతో పోల్చవచ్చు. అయితే అప్పుడప్పుడు హీబ్రూ భాషను సరిగా అర్థం చేసుకోలేని శ్రోతలు ఉండేవారు. వారికి రెండు భాషలు తెలిసిన దుబాసీలు హీబ్రూలోని విషయాలకు, వారి వారి భాషల్లో అర్థం తెలియచెప్పేవారు. ఒకరకంగా

ఇది ఆశు అనువాదానికి తార్కాణం అని చెప్పవచ్చు.

క్యూనిఫామ్ లిపిలో రాసిన ఇటుకలు తప్ప అనువాద కార్యక్రమాన్ని గురించి విశిష్టమైన సమాచారం ఏదీ లభించలేదు. నిజానికి అనువాద కార్యక్రమానికి ప్రామాణికమైన ఆధారం క్రీస్తుపూర్వం రెండో శతాబ్ది నాటిది. ప్రాచీన ఈజిప్టు చరిత్రను గురించి హీరోగ్లాయిఫిక్, డెమోతిక్ అనే లిపులలో ఈజిప్టు దేశపు చరిత్ర సంస్కృతులను గురించి రోజెటా (Rosetta) శిలాఖండం మీద రాసిన మూల సామగ్రి, దానికి గ్రీకు భాషలో అనువాదం లభించాయి. ఇప్పటివరకు లభించిన అనువాదాలలో ఇవే అన్నిటికంటే ప్రాచీనమైనవి.

**గ్రీసుదేశం:** పైన ఉదహరించిన వాటిని వదలిపెట్టేస్తే అనువాదాల వ్యవస్థితమైన సంప్రదాయం బైబిల్ అనువాదంతోనే ప్రారంభమైంది. ఓల్డ్ టెస్టమెంట్ (old testment) ను మొట్టమొదట హీబ్రూ భాషలో రాశారు. ఈజిప్టు, అలెగ్జాండ్రియాలలో గ్రీకు భాష తెలిసిన యూదులు చాలా మంది ఉండేవారు. హీబ్రూలోని old testment ను గ్రీకు భాషలో అనువదించాల్సిన అవసరం వారికి కనిపించింది. చాలామంది యూదులు క్రీ.పూ. 3, 2, శతాబ్దాలలో బైబిల్ (old testment)ను గ్రీకు భాషలోకి అనువదించారు. వీటిలో అతిప్రాచీనమైనది శప్తుఆగింట్ (Saptuagint). దీనిని 72 మంది అనువాదకులు 72 రోజుల్లో పూర్తిచేశారట. ఇది కేవలం శాబ్దికమైన అనువాదం. కాబట్టి గ్రీకు భాషా స్వభావానికి భిన్నంగా కనిపిస్తుంది. దీనితరవాత క్రీ.పూ. రెండో శతాబ్దంలో అక్విలా (Aquila) అనే యూదుజాతీయుడు గ్రీకు భాషలోకి బైబిల్‌ను అనువదించాడు. ఇది 'పదానికి పదం' అంటే మక్కీకి మక్కీ అనువాదం కావడంతో భాషాశైలి గజిబిజిగా ఉండి, విషయం ఏమాత్రం అర్థంకాదు. పైపెచ్చు మూలంలో ఉన్న భావం అనువాదంలో వ్యక్తం కావడంలేదు.

గ్రీసుదేశంలో ఆ ప్రాచీనకాలంలో బైబిల్ అనువాదం గురించి రెండు సిద్ధాంతాలు ప్రచారంలో ఉండేవి.

1. ఫిలొలాజికల్ థియరీ ఆఫ్ ట్రాన్స్‌లేషన్- (Philological theory of translation) భాషా శాస్త్రీయ అనువాదం.
2. ఇన్స్పిరేషనల్ థియరీ ఆఫ్ ట్రాన్స్‌లేషన్ (Inspirational theory of translation) ప్రేరణప్రధానమైన అనువాదం.

మొదటి పద్ధతిలో భాషాజ్ఞానం, విషయజ్ఞానం ప్రధానంగా ఉండి, అనువాదం చేయడమే ప్రధానలక్ష్యంగా పెట్టుకోడం చేత ఈ ప్రకారమైన అనువాద విధానం పాఠకులను అయోమయంలో పడవేసేటట్లుగా ఉండేది. రెండో పద్ధతిలో ఈశ్వరీయ ప్రేరణ ప్రధానంగా ఉండి, పాఠకులను ప్రేరేపితులను చేసి, దైవ కార్యమహిమలను తెలుసుకోడానికి ఉపకరించేట్లుగా ఉండేది.

ఆ రోజుల్లో మతం పట్ల మూఢ విశ్వాసంగల కొంతమంది బైబిల్‌లోని శబ్దాలను, శైలీక్రమాన్ని మంత్రాలుగా భావించి, కేవలం శబ్దానువాదాన్నే సమర్థించేవారు. శబ్దాలను, శబ్ద క్రమాలను మార్చినందువల్ల బైబిల్ మంత్రపాఠం తన మహత్తుని కోల్పోతుందనీ మార్చనందువల్ల బైబిల్ గొప్పతనం చెక్కుచెదరకుండా ఉంటుందనీ అనుకునేవారు. బైబిల్ అనువాదం సరళంగా ఉండకుండా గజిబిజిగా ఉండాలనే అనుకునేవారు. మరికొంతమంది బైబిల్‌లోని విషయాన్ని లక్ష్యభాషా స్వభావానికి అనురూపంగా కొద్దికొద్ది మార్పులు చేయాలని విశ్వసించేవారు.

గ్రీసుదేశం అన్నిరకాల విద్యలకు, శాస్త్రాలకు ఆటపట్టు అయినందువల్ల వారికి బైబిల్‌తప్ప మరే ఇతర గ్రంథాలను తమ భాషలోకి అనువదించుకోవలసిన అవసరం కనపడలేదు. కాబట్టి ప్రాచీన గ్రీకుసాహిత్యంలో బైబిల్ అనువాదాలే తప్ప ఇతర విషయాల అనువాదాలు కనిపించవు.

**రోమన్‌దేశం:** ప్రాచీనకాలంలో గ్రీకులకంటే రోమన్‌దేశస్థులు బైబిలేకాకుండా ఇతర అనేక గ్రంథాలను కూడా తమ భాషలోకి అనువదించుకొన్నారు. కావ్యాలు, నాటకాలే కాక వేదాంత పరమైన, సాంఘిక విషయపరమైన, తత్వప్రధానమైన గ్రంథాలను అనువదించుకొన్నారు. ముఖ్యంగా ఆ రోజుల్లో ఈ గ్రంథాలను గ్రీకు భాషనుంచి అనువాదం చేసుకోడం జరిగింది. క్రీ.పూ. 3వ శతాబ్దిప్రాంతంలో లివియస్ యాంద్రోనికస్ (Livius Andronicus) హోమర్ రచించిన ఒడెస్సీ (Odyssey)ని లాటిన్ ఛందస్సులో అనువాదం చేశాడు. నేవియస్ (Naevius) ఏనియస్ (Ennius) అనే వారు గ్రీకు భాషలోని ఎన్నో నాటకాలను అనువదించారు. క్రీ.పూ. మొదటి శతాబ్దంలో సిసిరో (Cicero) అనే అనువాదకుడు, ప్లేటో రచించిన ప్రొతాగరస్ (Protagoras), మరికొన్ని గ్రీకు నాటకాలను అనువదించాడు. రోమియో అనే అతను అనువాదం చేయడమేకాక అనువాదం చేసేటప్పుడు ఎదురయ్యే సమస్యలను గురించి కూడా చర్చించాడు. ఇలా అనువాద సమస్యలను చర్చించినవారిలో క్వింతిలియన్, హోరెస్, సిసిరో, కైతులస్‌లను పేర్కొనవచ్చు. వీరిలో సిసిరో ప్రధానుడు. ఆయన అనువాదంలో ఎదురయ్యే సమస్యలనే కాక లోగడ శబ్దానువాదకులు చేసిన లోపాలను గురించి కూడా చెప్పాడు. ఒకచోట ఆయన ఇలా అన్నాడు. "What men like you ... ...Call fidelity in translation, the learned term pestilent minuteness -- . It is hard to preserve in a translation the charm of expression which in another language are most felicitions... If I render word for word, the result will sound uncouth, and if compelled by necessity I alter anything in order or wording, I shall seem to have departed from the function of a translator".

అంటే మూలనిష్ఠంగా పదానికి పదం అనువాదం చేస్తే ఒకరకమైన ఇబ్బంది. అలాకాక స్వతంత్రానువాదం చేస్తే ఇంకో రకమైన ఇబ్బంది. అంటే వెనక్కి పోతే నుయ్యి, ముందుకు పోతే గొయ్యి లాంటి సమస్యను ఎదుర్కోవలసివస్తుంది. క్రీ.శ. 4వ శతాబ్దంలో సెంట్ జెరూమ్

(St. Jerome) చేసిన బైబిల్ అనువాదం చెప్పుకోదగినది. సంప్రదాయబద్ధంగా వస్తున్న పదానువాద శైలిని పరిహరించి, జెరూమ్ అర్థబోధకమైన శైలిని అనుసరించాడు (Sense for sense and not word for word). ఇలా చేసినందువల్ల మతఛాందసులు ఆయనను ధర్మద్రోహిగా పరిగణించి జీవితాంతం నానా యాతనలకు గురిచేశారు. అయితే ప్రపంచచరిత్రలోనే మొట్టమొదటిసారిగా ఒక పద్ధతి ప్రకారం సశాస్త్రీయంగా అనువాదం చేసిన వ్యక్తి సెయింట్ జెరూమ్. ఆయన అనువాదం చేయటమే కాక అనువాదానికి సంబంధించిన విషయాలను గురించి కూడా చర్చించాడు.

జెరూమ్‌కు సమకాలికుడు రుఫినస్ (Rufinus). అనువాదంలో ఈయన జెరూమ్ కంటే ఎక్కువ స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించాడు. అనువాద శాస్త్రవేత్త కావటంచేత అక్కడక్కడ జెరూమ్‌ను ఖండించాడుకూడా.

గ్రీసుదేశస్థులు బైబిల్‌ను మాత్రమే అనువదించుకుంటే రోమ్ దేశస్థులు అనేకానేక విషయాలకు సంబంధించిన గ్రంథాలను అనువదించుకున్నారు. అదేకాకుండా అనువాద పద్ధతులను గురించి కూడా చర్చించారు. పదానికి పదమా? పదానికి అర్థమా? అనే విచికిత్సను ప్రారంభించిన గొప్పతనం రోమన్ శాస్త్రజ్ఞులదే.

**అరేబియా దేశం:** ప్రాచీనకాలంలో అరేబియాదేశంలో అనువాదాల సంఖ్య గుణాతీతంగాను, గణాతీతంగాను పేర్కొనదగింది. జ్ఞానవిజ్ఞానాల పట్ల ఆసక్తి కలిగిన అరబ్బులు వ్యాపారరీత్యా తాము వెళ్ళిన ప్రతిదేశంలోని సుప్రసిద్ధ శాస్త్ర శాస్త్రేతర గ్రంథాలను తమ భాషలోనికి అనువదించుకునే ప్రయత్నం చేశారు. వారు ప్రధానంగా భారతీయ గ్రంథాలను, గ్రీకు భాషలోని గ్రంథాలను అనువదించుకొన్నారు.

అయితే అరబ్బులు పదానువాద పద్ధతిని అనుసరించక భావానువాద పద్ధతినే గ్రహించారు. ప్రపంచ చరిత్రలోనే అనువాద కార్యక్రమానికి ప్రత్యేకంగా ఒక సంస్థను ఏర్పాటుచేసి, ఆ సంస్థ ద్వారా అనువాదాలు చేయించే పద్ధతిని కొనసాగించిన గౌరవం అరబ్బులదే. ఖలీఫా అల్ మామూమ్ క్రీ.శ. 830లో బైతుల్‌హిక్ మా (జ్ఞానగృహం) అనే సంస్థను స్థాపించాడు. ఈ సంస్థద్వారా ఇతర భాషలలో వెలువడిన శాస్త్ర-విజ్ఞాన-సాహిత్య గ్రంథాలను అనువాదం చేయించాడు. నిజం చెప్పాలంటే అరేబియా దేశంలో జరిగిన అనువాదాల మూలంగానే జ్యోతిష, గణిత, నీతికథల ప్రభావం వల్లనే ఐరోపా దేశాలలోని శాస్త్రవిద్యలు, సాహిత్య రచనలు రాణించాయి.

**ఐరోపా దేశాలు:** 12వ శతాబ్దంలో స్పెయిన్ దేశంలోని తొలేదొ అనే నగరం విద్యాకేంద్రంగా విలసిల్లింది. ఆ నగరంలో గ్రీకు భాషలోని అనేక ఉత్తమ గ్రంథాలను అనువదించారు. అయితే ఈ అనువాదాలు నేరుగా గ్రీకు భాషనుంచి కాక అరబ్బీ లేదా సీరియా

భాషలనుంచి జరగటం గమనార్హం. ఇలా అనువాదాలు చేయడమేకాని అనువాద శాస్త్రాన్ని గురించి ఎక్కువగా చర్చలు జరగలేదు. అయితే 12వ శతాబ్ది చివరిలో పదానువాద పద్ధతిని ఖండించి, మైమొనీదస్ (Maimonides) అనే అతను భావానువాదాన్ని సమర్థించాడు.

ఐరోపాలోని ఇతర దేశాల్లో కూడా గ్రీకు భాషా సాహిత్యంలోని ఉత్తమ గ్రంథాలను తమ తమ భాషల్లోకి అనువదించుకున్నారు. వీరిలో జర్మన్ దేశానికి చెందిన మార్టిన్ లూథర్, (క్రీ.శ. 1483-1546) చెప్పుకోదగ్గవాడు. ఈయన క్రైస్తవ మతంలో ప్రొటెస్టాంట్ సంప్రదాయాన్ని నెలకొల్పాడు. లూథర్ కంటే ముందే ఫ్రెంచి (French), ఇంగ్లీషు (English), డచ్ (Dutch), జర్మన్ (German) మొదలయిన భాషల్లో న్యూటెస్ట్‌మెంట్ (New testment) అనువదించారు. ఈ కాలంలో కూడా నికోలస్ ఫామ్‌వాయిల్ (Nicolas Vonwyle) అనే విద్వాంసుడు పదానువాదాన్ని సమర్థిస్తే, ఎరాస్‌మస్ (Erasmus) అనే పండితుడు భావానువాదాన్ని సమర్థించాడు. అయితే పూర్వం మాదిరిగా పదానువాదం (Word to word translation) కాకుండా భావానువాదానికి(meaningful) ప్రాధాన్యం లభించింది. క్రీ.శ. 1522లో లూథర్ న్యూటెస్ట్‌మెంట్‌ను అనువదించి ప్రచురించాడు. ఆయనే 1534లో బైబిల్ గ్రంథాన్ని ఆసాంతం అనువదించాడు. ఆ అనువాదం జర్మన్ భాషకు ప్రామాణికంగా (standard) రూపుదిద్దుకుంది. లూథర్ మూలాన్ని అనుసరించి చేసే అనువాదాల్లో ఉండే అస్పష్టతను పరిహరించి, అనువాదాలు అర్థవంతంగా, సుబోధకంగా ఉండాలనీ వక్కాణించాడు. లూథర్ మూలభాషలో ఉన్న విషయానికి ప్రాధాన్యం కల్పించి అనువాదం లక్ష్యభాష ప్రకృతికి అనుగుణంగా తీర్చిదిద్దుకోడానికి మూలంలో ఉన్న కొన్ని శబ్దాలను, అలంకారాలను వదిలివేయవచ్చనీ అవసరమయితే కొన్ని శబ్దాలను, అలంకారాలను జోడించి మూలంలోని భావాన్ని సుబోధకంగా వ్యక్తీకరించాలనీ సిద్ధాంతీకరించాడు. అనువాదకుడు మూలంలోని భావాన్ని హృదయంగమం చేసుకొని, అనువాదం పాఠకులకు అర్థమయ్యేటట్లుగా ఉండాలని నిర్వచించాడు. మార్టిన్ లూథర్‌కు సమకాలికుడైన ఫ్రెంచి రచయిత, అనువాదకుడు అయిన యతీనే దోలె (Etienne Dolet) (క్రీ.శ.1509-1546) అనువాద సిద్ధాంతాలను ప్రతిపాదించిన మొట్టమొదటి వ్యక్తి అని చెప్పవచ్చు. ఆయన క్రీ.శ.1540లో అనువాద సిద్ధాంతాలను గురించి శాస్త్రీయమైన వ్యాసాన్ని ప్రచురించాడు. నిర్భయంగా, సుస్పష్టంగా తనకు తోచిన విధంగా రాసి ప్రభుత్వ ఆగ్రహానికి గురై, ఎన్నోసార్లు జైలుకు వెళ్ళాడు. చివరకు Plato రాసిన సిద్ధాంతాలను తప్పుగా అనువదించాడనే నేరంమోపి ప్రభుత్వం అతణ్ణి చంపివేయటమేకాకుండా అతని శవంతోపాటు అతని రచనలను కూడా తగులబెట్టించింది. దోలే అభిప్రాయం ప్రకారం అనువాదకుడు మూలరచనలోని భావాన్ని, మూల రచయిత ఉద్దేశాన్ని బాగా ఆకళింపు చేసుకొని శబ్దప్రతిశబ్దానువాదం కాకుండా భావానువాద శైలిని అనుకరిస్తూ సరళ వ్యావహారిక భాషలో అనువాదం చేయాలనీ అయితే మూలరచయిత వెలిబుచ్చిన భావాలకు అనుగుణంగా అనువాదం

ఉండాలనీ సిద్ధాంతీకరించాడు.

16వ శతాబ్దిలోనే గ్రిగరి మార్టిన్ (Gregory Martin) అనే విద్వాంసుడు లూథర్, దోలేల సిద్ధాంతాలను ఖండించాడు, విలియమ్ ఫుల్కే (William Fulke) అనే విద్వాంసుడు సమర్థించాడు. విలియమ్ ఫుల్కే అభిప్రాయం ప్రకారం "To translate precisely out of the Hebrew, is not to observe the number of words, but the perfect sense and meaning as the Phrase of our tongue will serve to be understood".

ఫ్రాన్సుకు చెందిన బెతెక్స్ (Betteux) 1760 ప్రాంతంలో అనువాద సిద్ధాంతాలను గురించి తన అభిప్రాయాలను ప్రస్తుతీకరిస్తూ, వీలయినంతమటుకు మూలానుసారంగా వాక్యానువాదం చేయాలనీ, వాక్యాలు కూడా మూలానుసారంగా ఉండాలనీ, భావక్రమంకూడా మూలానుసారంగానే ఉండాలనీ, భావానువాదాన్ని పరిహరించాలనీ రాశాడు. వీలయినంతమటుకు అనువాదంలో మూలంలో లేని విషయాలను-పదాలను, వాక్యాలను కూడా - జోడించకూడదనీ మూలంలో ఉన్నవాటిని తు.చ. తప్పకుండా గ్రహించాలనీ, ఎక్కడన్నా అలా కాకుండా చేయవలసివస్తే అతి జాగ్రత్తగా ఉండాలనీ హెచ్చరించాడు.

జర్మన్ దేశానికి చెందిన హర్డర్ (Horder), ష్లెగెల్ (Schlegel) మొదలైన వారు కూడా అనువాదం మూలనిష్ఠంగానే ఉండాలని భావించారు.

**ఇంగ్లాండు** : ఇతర ఐరోపాదేశాలకంటే ఇంగ్లాండులో అనువాద సిద్ధాంత విమర్శ ఎక్కువగా జరిగింది. ఇంగ్లాండులో 9వ శతాబ్దంలోనే అనువాద కార్యక్రమం ప్రారంభమయింది. ఆల్‌ఫ్రెడ్ (Alfred) రాజు (849-901) స్వయంగా యోధుడు, విద్వాంసుడేకాకుండా మంచి అనువాదకుడుకూడా. అప్పటినుంచి 15, 16 శతాబ్దాలనాటికి ఇంగ్లీషు భాషలో అనువాదాలు చాలా జరిగాయి. బైబిల్ న్యూటెస్ట్‌మెంట్‌ను జాన్ విక్లిఫ్ అనే అతను మొట్టమొదటిసారి ఇంగ్లీషులోకి అనువదించాడు. థామస్‌నార్త్ (Thomas North), జార్జిచాప్‌మాన్ (George Choppman), కింగ్ జేమ్స్ (King James) మొదలయినవారు ఎన్నెన్నో అనువాదాలు చేశారు. ఇవి ముఖ్యంగా బైబిల్, గ్రీకు, లాటిన్ భాషల రచనలకు అనువాదాలు. 17-18వ శతాబ్దాలలో బైబిలే కాకుండా ఇతర గ్రంథాల అనువాదంకూడా జరిగింది. ఈ అనువాదకులు తమ అనువాదాల్లో మూల రచనల్లోని భావాన్ని యథాతథంగా అనువదించడానికే ప్రయత్నం చేశారు. అబ్రహామ్ కౌలి (Abraham Kauli) అనే అనువాదకుడు స్వేచ్ఛానువాదానికి తావు కల్పించాడు. తన ఇష్టానుసారంగా మూలంలో మార్పులు-చేర్పులు చేశానని అన్నాడు. డ్రైడెన్ అనే కవి, కౌలి చేసిన అనువాదాలను మెచ్చుకోలేదు.

డ్రైడన్ (Dryden) (క్రీ.శ.1680) అభిప్రాయం ప్రకారం అనువాదాలు మూడు రకాలు

(1) Metaphrase, a word for word and line for a line type of rendering.

(2) Paraphrase,

(3) Imitation

అయితే డ్రైడెన్ పదానువాదాన్నీ, అనుకరణనూ కాక భావానువాదానికి ఎక్కువ ప్రాధాన్యం కల్పించాడు. ఆయన అభిప్రాయం ప్రకారం "It is impossible to translate verbally and well at the same time. It is much like dancing on ropes with fettered legs. A man may shun a fall by using caution but the gracefulness of motion is not to be expected." డ్రైడెన్ మూలరచయిత చెప్పిన భావం, శైలి, రెండింటిని దృష్టిలో పెట్టుకొని అనువాదం చేయాలన్నాడు.

18వ శతాబ్దంలో అలెగ్జాండర్ పోప్ (Alexander Pope) విలియమ్ కూపర్ (William Cowper), జాన్ వెస్లి (Jhon wesley), జార్జ్ కేంబెల్ (George Campbell) మొదలయినవారు అనువాద రంగంలో పేర్కోదగిన కృషి చేశారు. ఇందులో కొంతమంది మూలనిష్ఠంగాను, కొంతమంది అచ్చంగానూ, భావానువాదం చేశారు. కూపర్ అనువాదం మూలనిష్ఠంగానే ఉండాలన్నాడు. (Fidelty indeed is the very essence of translation. And the term itself implies it.) కాని పోప్ మూలాన్ని గాలికి వదిలిపెట్టి భావానువాదమే చేశాడు.

జాన్‌వెస్లీ, కేంబెల్ ఇద్దరూ గాస్‌పెల్ (Gospel) అనే పేరిట న్యూటెస్ట్‌మెంట్‌ని అనువాదం చేశారు. కేంప్‌బెల్ తన అనువాద గ్రంథానికి 700 పేజీల పీఠిక రాశాడు. అందులో బైబిల్ అనువాదాల చరిత్రను, అనువాద సిద్ధాంతాలను చాలా నిశితంగా, విస్తృతంగా చర్చించాడు. ఇలా అనువాద చరిత్రనూ, అనువాద సిద్ధాంతాలను గురించి రాసిన వారిలో కేంబెల్ ప్రథముడు. తాను చెప్పిన సిద్ధాంతాలను ఆయన సోదాహరణంగా వివరించాడు. ఆయన అభిప్రాయం ప్రకారం:

1. మూలంలోని భావాన్ని ఎటువంటి మార్పులు లేకుండా లక్ష్యభాషలో అభివ్యక్తీకరించాలి.

2.లక్ష్యభాషా స్వభావానికి అనుగుణంగా వీలయినంతమటుకు మూల భావాన్నీ, శైలినీ అనువాదంలో అభివ్యక్తీకరించాలి.

3.అనువాదం స్వాభావికంగానూ, ప్రవాహయుక్తంగానూ ఉండి మౌలికరచన మాదిరిగా ప్రతిబింబించాలి.

పైన చెప్పినవారు ప్రధానంగా అనువాదకులై ఉండి, ఆనుషంగికంగా అనువాద సిద్ధాంతాల గురించి చర్చించారు. అలెగ్జాండర్ ఫ్రేజర్ టిట్లర్ (Alexandar Phrazer Tyttler) అనే విద్వాంసుడు అనువాద సిద్ధాంతాల గురించి సశాస్త్రీయంగా చర్చించిన మొట్టమొదటి విమర్శకుడు. మొదట్లో చరిత్రోపన్యాసకుడిగా ఉండి, ఆ తరవాత టిట్లర్ న్యాయమూర్తిగా పనిచేశాడు.

1790లో మొదటిసారిగా ఆయన రాయల్ సొసైటీ సమావేశంలో అనువాద సిద్ధాంతాలను గురించిన తన వ్యాసం చదివాడు. తరవాత మారుపేరుతో దాన్ని ప్రచురించాడు. ఈ వ్యాసంలో చాలా విషయాలు కేంబెల్ రాసిన గాస్పెల్ పీఠికతో సరిపోలి ఉండటంతో 'ఈ వ్యాసరచయిత నా సిద్ధాంతాలనే మారుపేరుతో ప్రతిపాదించాడ'ని, కేంబెల్ అన్నాడు. కాని టిట్లర్ దాన్ని ఖండిస్తూ అనువాద ప్రక్రియను గురించి లోతుగా విమర్శించే ఏ రచయిత అయినా ఇలాగే ఆలోచిస్తాడు, ఇలాగే రాస్తాడని అన్నాడు. అయితే తరవాతి కాలంలో టిట్లర్ రాసిన వ్యాసమే ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నది. ఎందుకంటే టిట్లర్ కేవలం బైబిల్ అనువాదాలనే కాకుండా, ఇతర సాహిత్య ప్రక్రియల అనువాదాల గురించి కూడా చర్చించాడు. టిట్లర్ రాసిన గ్రంథం పేరు- "An essay on the principles of Translation". ఇందులో అనువాదాన్ని గురించిన మూడు సిద్ధాంతాలను ఆయన ప్రతిపాదించాడు.

(1) అనువాదంలో మూలరచనలోని భావాలను పూర్తిగా వ్యక్తీకరించాలి.

(2) మూలంలోని శైలినే అనువాదంలోకూడా అనుసరించాలి.

(3) అనువాదం మౌలిక రచన మాదిరిగా ప్రతిబింబించాలి.

నిజానికి ఈ మూడు కేంబెల్ చెప్పినటువంటివే. కాని టిట్లర్ చెప్పిన పద్ధతి శాస్త్రీయంగా కనిపించి పాఠకులను ఆకట్టుకొన్నది. టిట్లర్ అనువాద పద్ధతిని గురించే కాకుండా, అనువాదకుడి లక్షణాలను గురించి కూడా చర్చించాడు.

సుప్రసిద్ధుడైన విమర్శకుడు, కవి మాథ్యూ ఆర్నాల్డ్ (Mathew Arnold) స్వయం అనువాదకుడు, అనువాద సిద్ధాంత విమర్శకుడు కూడా. ఆయన హోమర్ రచించిన ఓడెస్సీలోని కొన్ని భాగాలను ఇంగ్లీషులో, ఛందోబద్ధంగా అనువదించి 'On translating Homer' అనే పేరిట నాలుగు ఉపన్యాసాలు ఇచ్చాడు. ఈ నాలుగింటిలో అప్పటివరకు ఇంగ్లీషులో వెలువడిన అనువాద సాహిత్యాన్ని, అనువాద ప్రక్రియలోని కష్టసాధ్యాలను గురించి చర్చించాడు. ఆర్నాల్డ్ అభిప్రాయం ప్రకారం అనువాదం మూలనిష్ఠమై ఉండటమే కాకుండా, లక్ష్యభాషకు అనుగుణంగా కూడా ఉండాలి. మూల రచన చదువుతున్నప్పుడుకాని, వింటున్నప్పుడు కాని పాఠకునిపై, శ్రోతపై కలిగే ప్రభావమే అనువాదం చదువుతున్నప్పుడు, వింటున్నప్పుడు లక్ష్యభాష పాఠకునికి/ శ్రోతకు కలగాలి. అనువాదం చేస్తున్నప్పుడు మూల రచయితతో తాదాత్మ్యం పొంది అనువదిస్తే లక్ష్యభాషలో కూడా అలాంటి ప్రభావమే కలుగుతుంది. వీలయినంతమటుకు భావం, శిల్పం రెండూ అనువాదంలో వ్యక్తమవ్వాలి.

ఫిట్జ్‌రాల్డ్ (Fitzgerald) ఉమర్‌ఖయ్యాం రుబాయిలను ఇంగ్లీషులోకి అనువదించి, ఉమర్‌ఖయ్యాం రచనలను ప్రపంచ ప్రఖ్యాతం చేశాడు. ఇదేకాక స్పెయిన్ భాషలోని కొన్ని నాటకాలను, కొన్ని గ్రీకు రచనలను, ఫారసీ రచనలను అనువదించాడు. ఫిట్జ్‌రాల్డ్ అభిప్రాయం ప్రకారం అనువాదం పదానువాదంలా ఉండకూడదు. అనువాదకుడు తన అభిరుచిని బట్టి

మూలరచనను, తిరిగి రాయాలి. "ప్రాణరహితమైన సింహంకంటే ప్రాణ సహితమైన శునకం మేలు కదా!" అని అభిప్రాయపడ్డాడు. కావ్యానువాదంలో రెండు, మూడు పద్యాలను ఒక పద్యంగాను, ఒక పద్యాన్ని రెండు, మూడు పద్యాలుగా విస్తరింపచేసే అధికారం అనువాదకుడికి ఉంటుంది. నిజానికి ఫిట్జ్‌రాల్డ్ మూలాన్ని ఆధారంగా చేసుకొని స్వతంత్ర రచన చేశాడు. అంటే ఉమర్‌ఖయ్యాం రుబాయిలకు నూతన జీవం పోసింది.

భారతదేశంలోకంటే పాశ్చాత్యదేశాల్లో అనువాదాలే కాకుండా అనువాద సిద్ధాంతాలను గురించిన చర్చలు, విమర్శలు, ఎక్కువగా జరిగినట్లు సుస్పష్టమవుతుంది. ఫ్రీలాన్సర్ అనువాదకులకంటే శాస్త్రీయ విషయజ్ఞానం కలిగిన అనువాదకుడు చక్కటి నైపుణ్యంతో అనువాదం చేయగలుగుతాడు. అయితే ప్రొఫెషనల్ అనువాదకుడికంటె అనువాదం పట్ల అభిరుచి, నిజాయితీ కలిగిన అనువాదకుడు ఉత్తమమైన అనువాదాన్ని అందించగలుగుతాడనడంలో ఎటువంటి సందేహంలేదు.

# అనువాదం - శాస్త్రం, కళ, శిల్పం

అనువాద ప్రక్రియలో నైపుణ్యం నిరంతర సాధన, శిక్షణ మీద ఆధారపడి ఉంటుంది. సాధన, శిక్షణ రెండూ నియమబద్ధత మీద ఆధారపడి ఉంటాయి. నియమబద్ధతే విజ్ఞాన శాస్త్రానికి మూలధాతువు.

కొన్ని నియమాలకు అనుగుణంగా మలచిన వ్యవస్థిత జ్ఞానమే శాస్త్రం. భాషాశాస్త్రంలో ధ్వనులు, పదాలు, రూపాలు, వాక్యాలు, అర్థాలు మొదలయిన వాటిని గురించిన వివేచన - విశ్లేషణ ఉంటుంది. Applied Lingustics లో ఒక శాస్త్రీయ దృక్పథం అలవడుతుంది. తులనాత్మకంగా లేదా Contrastive analysis ద్వారా మూలభాష, లక్ష్యభాషల్లోని సమానతలను, అసమానతలను విశ్లేషించటం జరుగుతుంది. దీనికి కొన్ని నిశ్చితమైన నియమాలు ఉంటాయి. అనువాదశాస్త్రం చెప్పే నియమాలను అధ్యయనం చేయటంవల్ల శాస్త్రజ్ఞానంలేని అనువాదకుడికంటే శాస్త్రజ్ఞానం ఉన్న అనువాదకుడు చక్కగా అనువాదం చేయగలుగుతాడు. అనువాదశాస్త్రాధ్యయనం అనువాదకుడి వివేచనా విధానానికి సరైన పునాదులు వేస్తుంది.

ఒక భాషలో అభివ్యక్తీకరించిన భావాలను - అవి సాహిత్య పరంకావచ్చు, శాస్త్రీయవిషయాలకు సంబంధించినవి కావచ్చు - వేరొక భాషలో వీలయినంతమటుకు సమతుల్యంగానూ (closest equivalent), లక్ష్యభాషకు సహజంగా, స్వాభావికంగా ఉండే విధంగానూ (natural) అభివ్యక్తీకరించడమే అనువాదం అని అన్ని నిర్వచనాల సారాంశం. అలా చేయడానికి అనువాదకుడిలో కొన్ని విశిష్ట లక్షణాలు, గుణాలు, యోగ్యతలు ఉండాలి. ఆ యోగ్యతలు ఉన్న అనువాదకుడు తన అనువాదాన్ని అందంగా, పఠనీయంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నం చేస్తాడు.

అనువాదశాస్త్రంలోని వివిధ విషయాలను అర్థం చేసుకుంటే తదనుకూలంగా తన అనువాదాన్ని పాఠకుల ముందుంచడానికి అనువాదకుడికి అవకాశం కలుగుతుంది. సుప్రసిద్ధ అనువాదకులయిన ప్రొ. విశ్వనాథ అయ్యర్ 'అనువాదశాస్త్రమనేది ఒక నదీతీరాన స్నానఘట్టానికి కట్టిన మెట్లవంటిద'ని[1] అన్నారు. మెట్లు లేని స్నానఘట్టం దగ్గర నదిలో దిగడం, స్నానం చేయడం కష్టసాధ్యంకదా! మెట్లు ఉంటే వ్యక్తి సులువుగా నదిలో దిగి, సునాయాసంగా స్నానం చేయగలుగుతాడు. అలాగే అనువాద శాస్త్ర సిద్ధాంతాలను, అనువాద విధానాలను, పద్ధతులను

1. వ్యావహారిక్ అనువాద్-ప్రొ. విశ్వనాథ అయ్యర్ - పేజీ 6.

బాగా తెలుసుకొని ఉంటే, అనువాదం చేయడం సులభతరం అవుతుంది.

అనువాదానికి ఉపక్రమించడానికి ముందుగా అనువాద శాస్త్రపరిజ్ఞానం అనువాదకుడికి సహకరిస్తుంది. అనువాదాన్ని గురించిన ప్రాథమిక జ్ఞానం (basic knowledge) అనువాదాన్ని శాస్త్రంగా చేస్తుంది.

'కల్' అనే ధాతువునుంచి నిష్పన్నమైన 'కళ' శబ్దానికి 'అందమైనది' అని అర్థం. హృదయంలోని భావాలను, ప్రతిస్పందనలను అందంగా అభివ్యక్తీకరించడమే కళ. ఇది సృజనశీలమయిన సాహిత్యానికి మూలబిందువు. సాహిత్యసృష్టి సృజనాత్మకమైనది అయితే అనువాదం పునఃసృజన, పునఃరచన, రీక్రియేషన్ (re-creation) కదా! ఈ అర్థంలో అనువాదాన్ని కూడా 'కళ' అనవచ్చు. ఇలా స్వీయ సృజనాత్మక ప్రతిభతో సహజంగా చేసే అనువాదం 'కళ'. అనువాదం పట్ల అభిరుచి ఉండి, సహజ ప్రతిభకల అనువాదకుడు చేసే అనువాదం, వృత్తిపరంగా చేసే అనువాదంకంటే కళాత్మకంగా ఉంటుంది.

సాహిత్యానువాదం అనువాదకుడి వ్యక్తిగత ప్రతిభతో ముడిపడి పాఠకుణ్ణి ఆకట్టుకుంటుంది. పునఃసృష్టి చేసే అనువాదకుడు నిస్సందేహంగా కళాకారుడే. ఇక్కడే వృత్తిపరంగా అనువాదం చేయడంలోను, స్వచ్ఛందంగా అనువాదం చేయడంలోను ఉన్న భేదం స్పష్టంగా గోచరిస్తుంది. ఈ దృష్టితో పరిశీలిస్తే ఉత్తమమైన అనువాదం శ్రేష్ఠ కళారూపమే.

మెరుగులుపెట్టి, అనువాదాన్ని సుందరతరంగా తీర్చిదిద్దే ప్రయత్నమే శిల్పం. కళకు, శిల్పానికి ఉన్న ముఖ్యభేదమేమిటంటే కళలో ఆత్మాభివ్యక్తికి స్థానం ఉంటుంది. శిల్పంలో కృతికి దూరంగా ఉండి (objective గా) దానికి మెరుగులుదిద్దే ప్రయత్నం నిరంతరం జరుగుతూ ఉంటుంది.

అనువాదంలో అనువాదకుడి ఆత్మాభివ్యక్తి కాకుండా, మూలరచయిత ఆత్మాభివ్యక్తిని హృదయంగమం చేసుకొని, దాన్ని తిరిగి లక్ష్య భాషలో అభివ్యక్తీకరించే ప్రయత్నం జరుగుతుంది. ఈ ప్రయత్నంలో అనువాదకుడి వ్యక్తిత్వానికి కూడా విశిష్టమైన స్థానముంటుంది.

ఒకసారి అభివ్యక్తీకరించిన రచనను (అనువాదాన్ని) మళ్ళీ మళ్ళీ మెరుగులు దిద్దే ప్రయత్నం 'శిల్ప'మనిపించుకుంటుంది. నేర్చుకుంటే వచ్చేది శిల్పకళ.

మూలభాషలో సహజంగా కవి అయినవాడు లక్ష్యభాషలో అనువాదం చేసినప్పుడు కవితా స్వారస్యం కొట్టొచ్చినట్లు కనబడుతుంది. కేవలం 'శిల్పి' అయిన వాడు చేసే అనువాదం సహజంగా ఉండక, ఎంతోకొంత కృతకత్వం కనిపిస్తుంది. కళలో సహజ ఆత్మాభివ్యక్తి ఉంటే,

శిల్పంలో నిరంతర అభ్యాసంతో సాధించిన నైపుణ్యం కనిపిస్తుంది. అనువాద శిల్పి అయినవాడు అనువాద శాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి, సాధన ద్వారా తనలోపాలను దిద్దుకోడానికి నిజాయితీతో ప్రయత్నం చేయాలి.

అనువాద శాస్త్రానికి సంబంధించిన సిద్ధాంతాలను, నియమాలను చక్కగా అధ్యయనం చేస్తే, మూల రచనను ఏవిధంగా, ఏరకం పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొని, ఎలాంటి అనువాదం చేయాలన్న విషయాన్ని నిర్ణయించుకోడానికి వీలు కలుగుతుంది.

అనువాదశాస్త్ర సిద్ధాంతాల గురించిన వివరణలను అనువాదశాస్త్రం అని, స్వచ్ఛందంగా సృజనాత్మక ప్రతిభ ఆధారంగా అనువాదం చేయడం కళ అని, నేర్చుకొని అభ్యాసపూర్వకంగా అనువాదం చేసి మార్పులు-చేర్పుల ద్వారా మెరుగులు దిద్దటాన్ని శిల్పం అని అనవచ్చు. ఈ విధంగా అనువాదాన్ని శాస్త్రంగాను, కళగాను, శిల్పంగాను కూడా పరిగణించవచ్చు.

# అనువాదకుడు - యోగ్యతలు

అనువాదప్రక్రియలో అనువాదకుడికి ఉండవలసిన లక్షణాల తారతమ్యతను బట్టి, అతడి అనువాదస్థాయి ఆధారపడి ఉంటుంది. అనువాదకుడికి తను చేసే అనువాద కార్యక్రమంలో ఉండే అభిరుచికి అనుగుణంగా అతడిలో స్వతహాగా కొన్ని యోగ్యతలు ఉండాలి. అందులో ప్రధానమైనవి:

(1) **మూలభాషా జ్ఞానం:** ఇది కేవలం భాషాజ్ఞానమే కాకుండా మూల భాషకు సంబంధించిన సంస్కృతీపరమైన వైశిష్ట్యాలు, వాఙ్మయ సంప్రదాయాలు, పదప్రయోగాలు, పదబంధాలు, జాతీయాలు, నుడికారాలు మొదలైన వాటిని గురించి అనువాదకుడికి క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. ఇంగ్లీషు భాషలో పూర్వప్రత్యయాలు (prepositions), ప్రయోగచమత్కారాలు, తెలుగు వాక్యంలో పదాలలో సంధివల్ల వచ్చే మార్పులు, (సరళాక్షరాలు, పరుషాక్షరాలుగా మారడం లాంటివి), హిందీలో లింగవచన భేదాలు - ఇలా ప్రతిభాషలోను కొన్ని విశిష్ట లక్షణాలు ఉంటాయి. అనువాదకుడు మూలభాషలో ఉండే విశిష్ట చమత్కారాలను ఆకళింపు చేసుకోవాలి. కేవలం భాషాజ్ఞానమే కాకుండా ఆ మూల భాషా సాహిత్యంలో ఉండే వైశిష్ట్యాలను కూడా గ్రహించగలిగి ఉండాలి.

(2) **లక్ష్య భాషాజ్ఞానం:** పైన చెప్పినట్లుగానే మూల భాషను ఏ భాషలోకైతే అనువదిస్తున్నామో, ఆ భాష అంటే లక్ష్యభాషకు సంబంధించిన సంస్కృతీపరమైన వైశిష్ట్యాలు, వాఙ్మయ సంప్రదాయాలు, పదప్రయోగాలు, పదబంధాలు, జాతీయాలు, నుడికారాలు మొదలైనవాటిని గురించి సముచితమైన అవగాహన ఉండాలి. ఈ అవగాహన అభివ్యక్తికి తగినంత బలం చేకూరుస్తుంది. ఈ అవగాహన లోపం వల్ల అనువాదాన్ని దోషయుక్తంగాను, మూలభావశైలీ వైశిష్ట్యానికి తగు విధంగా ఉండక పోవడం చేతను పాఠకుణ్ణి ప్రభావితం చేయలేకపోతుంది.

(3) **విషయజ్ఞానం:** అనువాదకుడికి మూలభాషాజ్ఞానం, లక్ష్యభాషాజ్ఞానం ఉండగానే సరిపోదు. విజ్ఞాన-శాస్త్రీయ విషయాలకు సంబంధించిన గ్రంథాలను అనువదించేటప్పుడు ఆయా విషయాలకు సంబంధించిన సముచిత జ్ఞానం ఉండాలి. 'The story of an Atom' అనే పుస్తకాన్ని అనువదిస్తున్నప్పుడు ఫిజిక్స్, కెమిస్ట్రీల జ్ఞానం అవసరం. అనువాదకుడికి తను అనువదిస్తున్నగ్రంథానికి సంబంధించిన శాస్త్రీయ-సాంకేతిక పదప్రయోగ పరిజ్ఞానం తప్పనిసరిగా

ఉండాలి. లేకపోతే అనువాదం లోపభూయిష్ఠంగా, విషయానికి ఆమడ దూరంగా ఉంటుంది.

సాహిత్యపరంగా చూస్తే శబ్దశక్తుల ప్రయోగం, అలంకారాల ప్రయోగవైచిత్రి; ఛందో నియమాల పరిజ్ఞానం (ఎంత బ్లాంక్ వెర్స్ అయినా ఒక విశిష్టమైన లయ, గతి ఉంటుంది) ఉండాలి.

(4) **నిజాయితీ:** ప్రతి అనువాదకుడు ప్రారంభంలోనే మూలభాషలో, లక్ష్యభాషలో సముచిత జ్ఞానం, సంపూర్ణ విషయజ్ఞానం కలిగి ఉంటాడని ఆశించడానికి వీలులేదు. ప్రతివ్యక్తికి తన పరిమితులు ఉంటాయి. అందువల్ల చక్కగా, సుబోధకంగా, మూలనిష్ఠంగా అంటే మూలంలో ఉండే భావాన్ని, శైలీవైశిష్ట్యాన్ని లక్ష్య భాషలో అదేవిధంగా అభివ్యక్తీకరించడానికి నిజాయితీగా ప్రయత్నించాలి. మూలభాషలో లేదా లక్ష్యభాషలో తనకు తెలియని అభివ్యక్తులను, పదబంధాలను మొదలయినవాటిని నిఘంటువులద్వారా లేదా అనుభవజ్ఞులైన విద్వాంసులవద్దకు వెళ్ళి తెలుసుకోడానికి సంకోచించకూడదు. అనువాద ప్రక్రియలో మూలభాషలో పండితులనూ, లక్ష్యభాషా వ్యవహర్తలనూ కలుసుకొని మూలభాషలోని ప్రయుక్తుల అర్థాలను గ్రహించి వాటిని లక్ష్యభాషలో ఉపయోగించే విధానాన్ని తెలుసుకోడానికి హృదయపూర్వకంగా, నిజాయితీతో ప్రయత్నం చేయాలి. ఈ నిజాయితీ పరిమాణాన్నిబట్టి అనువాదస్థాయి సంతృప్తికరంగా ఉంటుంది.

(5) **అభ్యాసం:** 'అభ్యాసం కూసువిద్య' అనే నానుడిని బట్టి అనువాదంలో ప్రావీణ్యం ఒక రోజులో అలవడేది కాదు. దానికి నిరంతరం కృషి చేస్తూనే ఉండాలి. ఎందుకంటే తెలుసుకోవాల్సిన విషయాలను, అనువాద ప్రక్రియలో గుణదోషాలను ఎప్పటికప్పుడు బేరీజు వేసుకుంటూ, అనువాదకుడు అవిశ్రాంతపథికుడిలా అనువాద రంగంలో ముందుకు సాగుతూ ఉండాలి. అందుకనే అనువాదకుణ్ణి నిరంతర విద్యార్థి అని చెప్పవచ్చు.

'అనువాద సమస్యలు' అనే పుస్తకంలో శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డిగారు అనువాదకుడి యోగ్యతలను వివరిస్తూ 'అనువాదకునికి మూలభాష బాగా తెలిసి ఉండాలి. అతను మూలభాషలో రచనలు చేయకపోయినా ఆ భాషతో ప్రగాఢమైన పరిచయం కలిగి ఉండాలి. అతను అనువాదం చేసేది తన మాతృభాషలోకి కాబట్టి ఆ మాతృభాషమీద అతనికి పరిపూర్ణమైన అధికారం ఉండాలని చెప్పనక్కర్లేదు' అని అన్నారు. అయితే మూలభాషలోనూ లక్ష్యభాషలోనూ పరిపూర్ణమైన అధికారం సంపాదించడానికి అనువాదకుడు నిరంతరం నిజాయితీతో కృషి చేస్తే, తన రంగంలో సాఫల్యం పొందగలడు.

పై లక్షణాలతోపాటు అనువాదకుడు తను అనువాదం చేయదలచుకున్న రచనను ఆ మూలాగ్రం సుష్ఠుగా చదువుకోవాలి. ఆ రచనలో అభివ్యక్తమైన భావాన్ని, రచయిత ఉద్దేశాన్ని చక్కగా ఆకళింపు చేసుకోవాలి. మూల రచయిత వాడిన పదాలను, నుడికారాలను, జాతీయాలను, వాక్య నిర్మాణ వైఖరిని అర్థంచేసుకోవాలి. అర్థంకానిచోట్ల నిఘంటువుల సహాయం పొందడమో

విద్వాంసులనడిగి తెలుసుకోవడమో చేయాలి. పెద్ద వాక్యాలను చిన్న వాక్యాలుగా విడగొట్టి అనువదిస్తే బాగుంటుందా లేదా చిన్నవాక్యాలను పెద్ద వాక్యాలుగా అనువదిస్తే బాగుంటుందా అని సమీక్షించుకోవాలి.

ఇలా మూల రచనను క్షుణ్ణంగా అర్థం చేసుకున్న తరవాత మూలాన్ని ఎదురుగా ఉంచుకొని, మూలానుసారంగా అనువాదం చేయాలి. ఆ తరవాత మూలరచనను అవతలపెట్టి, తన అనువాదం లక్ష్యభాషా స్వభావానికి అనుగుణంగా, సాఫీగా సాగిందో లేదో చూసుకోవాలి. మూల భాష ప్రభావం ఉంటే దాన్ని పరిహరించుకోవాలి. ఇలా అనువాదకుడు స్వయంగా తానే పరిశీలించుకుంటే అనువాదం తప్పులు లేకుండా ఉండగలదు. ఈవిధమైన 'పునఃపరిశీలన' (vetting) ఇతరులు చేస్తే బాగుంటుందని కొంతమంది విద్వాంసుల అభిప్రాయం.

అనువాదాన్ని ఇలా పరిశీలించుకున్న తరవాతే సాపుప్రతి (fair copy) తయారు చేసుకోవాలి.

అనువాదకుడు ఈ విధంగా నిజాయితీతో ప్రయత్నం చేస్తే, అతను ఈ రంగంలో రాణించగలడు. అనువాద ప్రతిభ భగవదత్తమైన వరంలాంటిది. నిరంతర అభ్యాసం ద్వారా తన ప్రతిభకు మెరుగులు దిద్దుకుంటూ ఉండాలి. మూల భాష, లక్ష్యభాషలోని గ్రంథాలను చదువుతూ, తన భాషాజ్ఞానాన్ని పెంపొందించుకుంటూ ఉండాలి.

చేసే అనువాదాన్ని బట్టి అనువాదకులను ముఖ్యంగా మూడు రకాలుగా వింగడించవచ్చు.

1. సాహిత్యానువాదకులు

2.సాహిత్యేతర-విజ్ఞానశాస్త్రం, న్యాయశాస్త్రం, రాజనీతి శాస్త్రం, సాంకేతిక విద్యలు-విషయాల అనువాదకులు

3.పత్రికారంగంలో అనువాదకులు

ఏ రకానికి చెందిన అనువాదకులకైనా, ఏ రంగంలో పనిచేస్తున్న అనువాదకులకైనా, అనువాదకులు తప్పనిసరిగా పై యోగ్యతలు-లక్షణాలు ఉంటే , పైన చెప్పిన విధానం ప్రకారం అనువాదం చేస్తే, పేరుప్రతిష్ఠలు లభిస్తాయి.

5

# అనువాదం - వివిధ రూపాలు

విషయం, అనువాదకుడు, పాఠకుడు మొదలయిన అంశాలనుబట్టి అనువాదాలు అనేక రకాలుగా ఉండవచ్చు. కాని ముఖ్యంగా 1. సాహిత్య ప్రక్రియలు ఆధారంగా 2. గద్యపద్యాలు ఆధారంగా, 3. విషయం ఆధారంగా 4. అనువాద స్వభావం ఆధారంగా నాలుగు ప్రధాన రకాలు ఉంటాయి.



## 1. సాహిత్య ప్రక్రియ

**(అ) కావ్యానువాదం:** మూలభాషలోని కావ్యాన్ని మూలనిష్ఠంగా, ఛందోబద్ధంగా అనువదించవచ్చు. లేకపోతే బ్లాంక్ వెర్స్ (blank verse)లో అనువదించవచ్చు. లేదా గద్యానువాదం చేయవచ్చు. సాధారణంగా కావ్యాన్ని ఛందోబద్ధంగానూ, బ్లాంక్‌వెర్స్‌లోను అనువదించడం జరుగుతూ ఉంటుంది. అయితే కొన్ని సమయాలలో మూలాన్ని యథాతథంగా లక్ష్యభాష లిపిలో లిప్యంతరణం (transliteration) తో సహా అనువాదం చేయవలసి వస్తే, మూలనిష్ఠంగా ఉండే గద్యానువాదమే సముచితంగా ఉంటుందని చాలామంది అభిప్రాయం. కావ్యానువాదంలో అనేక సమస్యలు ఎదురౌతాయి. ఈ సమస్యలను మరో అధ్యాయంలో విపులంగా చర్చించడం సముచితంగా ఉంటుంది.



**(ఆ) నాటకానువాదం:** నాటకాన్ని నాటకరూపంలోనే అనువదించవచ్చు లేదా నాటకాన్ని కథారూపంగా, కావ్యరూపంగా అనువదించవచ్చు. అయితే నాటకం పాఠ్యమే కాకుండా అభినేయం కూడా కాబట్టి ప్రదర్శనానుకూలంగా అనువాదం సాగితే బాగుంటుంది. అనువాదకుడికి స్టేజి క్రాఫ్టు (stage craft)ను గురించిన జ్ఞానం ఉండాలి. అప్పుడే నాటకాన్ని నాటకరూపంలో అనువదించినప్పుడు అది పాఠకుణ్ణే కాకుండా ప్రేక్షకుణ్ణికూడా ఆకట్టుకుంటుంది.

**(ఇ) ఇతరప్రక్రియలు:** కథ, నవల, వ్యాసం మొదలయిన ప్రక్రియల అనువాదం చేసేటప్పుడు ఆయా ప్రక్రియల విశిష్ట లక్షణాలను అనుసరించి అనువాదం చేయాలి. వర్ణనలు, సంభాషణలు, మొదలయినవి అనువదించడంలో తగు జాగ్రత్తలు వహించాలి. వీటిల్లో ముఖ్యంగా ఎదురయ్యే సమస్య- శీర్షికల అనువాదం. రాజస్థాన్‌కు చెందిన ఓ ప్రముఖ పారిశ్రామికవేత్త జీవిత చరిత్ర **'मरुभूमि का मेघ'** అనే పేరిట వెలువడింది. శీర్షిక చాలా సార్థకంగా ఉంది. ఆ శీర్షికను 'ఎడారిలో ఒయాసిస్సు' అని అనువదించవచ్చు. ఇది శబ్దానువాదం కాకపోయినా, మూలరచయిత భావాన్ని (spirit) ని అభివ్యక్తీకరిస్తుంది. అలానే 'దొరబాబు' (తెలుగువారు తమ పిల్లవాడిని గారాబంగా దొరబాబు అని పిలుచుకుంటారు)ను **'राजा बेटा'** అని అనువదించవచ్చు.

గుడిపాటి వెంకట చలంగారి కథ 'ఓ పువ్వు పూసింది' (తెలుగులో అప్రాణివాచకాలను అమహత్తులుగా వాడతాం) కాని హిందీలో పువ్వు = फूल అనే పదం పుంలింగంలో వాడతారు ఫూల్‌కు బదులు 'కలీ' అని వాడితే సముచితంగా ఉంటుంది.

## 2. గద్య పద్యాలు

మూలభాషలో కావ్యరూపంలో ఉన్న గ్రంథాన్ని లక్ష్యభాషలో బ్లాంక్ వెర్స్‌లోనూ, గద్యరూపంలోనూ అనువదించవచ్చు. ఛందోబద్ధంగా అనువదించాలనుకున్నప్పుడు, మూలభాషలోని ఛందస్సునే స్వీకరించాలా? లేదా లక్ష్యభాషలో వ్యవహారంలో ఉన్న ఛందస్సును స్వీకరించాలా? అనే సమస్య తలెత్తుతుంది. ఇది అనువాదకుడి ప్రతిభమీద, పాఠకుడి అభిరుచిమీద ఆధారపడి ఉంటుంది. ఎటువంటి పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొని అనువాదం చేస్తున్నామో ఆలోచించి ఈసమస్యను పరిష్కరించుకోవలసి ఉంటుంది.

మూలభాషలో కావ్యాన్ని బ్లాంక్‌వెర్స్‌లో అనువదించడమే సముచితంగా ఉంటుందని చాలా మంది విద్వాంసుల అభిప్రాయం. బ్లాంక్‌వెర్స్‌లో అయితే వీలయినంత మటుకు మూలభాషలోని విషయాన్ని, శైలీ ప్రయోగ వైశిష్ట్యాలను, అంతర్గత లయను, లక్ష్యభాషా స్వభావానికి అనుగుణంగా అనువదించడానికి అవకాశం ఉంటుంది.

## 3. విషయం

విషయం ఆధారంగా భాష దాని శైలి భిన్నంగా ఉండడం సహజం. సాహిత్య ప్రక్రియలలో భావం కంటే దాన్ని అభివ్యక్తీకరించే పద్ధతి విశిష్టంగా ఉంటుంది. అయితే సాహిత్యేతర విషయాలలో అంటే వైజ్ఞానిక, సాంకేతిక విషయాలలో భాషాశైలి తదనుగుణంగా ఉంటాయి. వైజ్ఞానిక, సాంకేతిక విషయాలలో అభివ్యక్తి శైలికంటే తథ్యాల (facts) కు ప్రాధాన్యం ఉంటుంది. కనుక సాహిత్య, సాహిత్యేతర విషయాలను దృష్టిలో పెట్టుకుని చేసే అనువాదాలలో భాషాశైలికి-అభివ్యక్తీకరణకు, విషయానికి ఉన్న ప్రాధాన్యాన్ని గుర్తుపెట్టుకోవాలి.

## 4. అనువాద స్వభావం

స్వభావాన్ని అనుసరించి అనువాదాలు ఈ కింది విధాలుగా ఉంటాయి.

**(1) మూలనిష్ఠ అనువాదం:** మూలభాషలో ఉండే గ్రంథాన్ని వీలయినంతమటుకు అదే విధానం అంటే విషయం, ప్రస్తుతీకరణం- Matter and manner- అనుసరిస్తూ, అనువదించాలి. అంటే చెప్పిన విషయం, చెప్పిన విధానం రెండింటినీ అనువాదకుడు తన అనువాదంలో వ్యక్తీకరించాలి. పూర్తిగా మూల విధేయమైన అనువాదం లక్ష్యభాషా స్వభావానికి అనుగుణంగా ఉండక, సహజత్వం కోల్పోడంతో పాఠకుణ్ణి అయోమయంలో పడవేస్తుంది. ఇలాంటి అనువాదాన్ని literal లేదా verbatum లేదా true translation అంటారు. ఇది- పదానువాదం- మూలానికి ఏవిధంగానూ న్యాయం చేకూర్చలేదు. ప్రాచీన, మధ్యయుగాలలో గ్రీకు, రోమను భాషలలో

బైబిల్ అనువాదాలు ఇలాంటివే.

**(2) మూలముక్త అనువాదం:** కొంతమంది అనువాదకులు మూలాన్ని - మూలంలోని విషయాన్ని మాత్రం గ్రహించి తమ పద్ధతిలో అభివ్యక్తీకరిస్తూ ఉంటారు. ఇందులో మూలాన్ని సంక్షిప్తీకరించడం, పాఠకుల అవసరాలను బట్టి మూలంలో మార్పులు, చేర్పులు చేస్తూ అనువదించడం జరుగుతుంది. ఇది మూల రచనపైన ఆధారపడి ఉన్నా స్వతంత్రంగా, స్వేచ్ఛానువాదంగా, లక్ష్యభాషా స్వభావానికి అనుగుణంగా ఉంటుంది.

పైన చెప్పిన వాటిలో చాలామంది అనువాదకులు పదానువాదం లేదా వాక్యప్రతివాక్య అనువాదం కూడా చేస్తూంటారు. అయితే ఈ పదానువాద, వాక్యానువాద పద్ధతి లక్ష్యభాషా స్వభావానికి అనుగుణంగా, పఠనీయంగా గానీ ఉండక, మూలంలోని భావాలను, శబ్దప్రయుక్తులను తగు విధంగా వ్యక్తీకరించలేక పోతుంది. ఇటువంటి అనువాదాలను దృష్టిలో పెట్టుకునే 'A translator is a traitor' అనే నానుడి వ్యవహారంలోకి వచ్చి ఉంటుంది.

మూలముక్త అనువాద పద్ధతి ప్రకారం అనువాదం చేశారనడం కంటే, మూలాన్ని తిరగ రాశారనడం సబబుగా ఉంటుంది. కేవలం మూలంలోని భావాన్ని (spirit of the original author) గ్రహించి, లక్ష్యభాషకు అనుగుణంగా పద్యంగానో, ముక్తఛందస్సుగానో, గద్యంగానో అనువదించడం జరుగుతుంది. ప్రాచీన కాలంలోని తెలుగు కావ్యాలు, ఉమర్ ఖయ్యాం రుబాయిలకు ఫిట్జ్‌రాల్డ్ అనువాదం, 'ఇలియడ్' కు అలెగ్జాండర్ పోప్ చేసిన అనువాదం మొదలయినవి మూలముక్త అనువాదాలు.

**(3) భావానువాదం:** మూలంలోని శబ్దప్రయోగాలు, వాక్యాలు, పదబంధాలు (Phrases) మొదలయిన వాటిని ప్రధానంగా తీసుకోక మూలరచనలోని భావాన్ని, అర్థాన్ని మాత్రమే ప్రధానంగా గ్రహించి మూలంలోని భావాన్ని లక్ష్యభాషలో అభివ్యక్తీకరించడానికి ప్రయత్నించడమే భావానువాదం. మూలరచనలోని కథా సంవిధానాన్ని మాత్రం గ్రహించి, పేర్లను కూడా లక్ష్యభాషకు అనుగుణంగా మార్చి అనువదించడం జరుగుతుంది. అనువాదం అని చెప్పకపోతే ఇది మౌలికరచనలా ఉంటుంది.

**(4) స్వేచ్ఛానువాదం:** మూలరచనలోని భావాన్ని మాత్రం గ్రహించి, అందులోని ఛాయ (shade of meaning) ను మాత్రం అభివ్యక్తీకరించడమే స్వేచ్ఛానువాదం. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే మూలంలోని భావాన్ని గ్రహించి, అనువాదకుడు దాన్ని తనకు నచ్చినట్లుగా లక్ష్య భాషలో అభివ్యక్తీకరించడమే స్వేచ్ఛానువాదం.దీనిని ఇంగ్లీషులో free translation అంటారు.

**(5)సారానువాదం:** మూలభాషలోని రచనను, మూలముక్తంగా (మూలానుసారంగా కాక) లక్ష్యభాషా స్వభావానికి, సంప్రదాయాలకు అనుగుణంగా, అతిస్వాభావికంగా, మూలంలోని విషయం పాఠకుడికి అర్థమయ్యే పద్ధతిలో, సంక్షిప్తంగా అనువదించడాన్ని సారానువాదం అంటారు.

ఉదా: షేక్సిపియరు నాటకాన్ని మూలభావానికి భంగం వాటిల్లకుండా దాని కథాసారాంశాన్ని పది, పదిహేను పేజీల్లో ప్రస్తుతీకరించడాన్ని సారానువాదం అంటారు. ఇది కూడా పాఠకుడి స్థాయిమీద, పఠానాసక్తి మీద ఆధారపడి ఉంటుంది.

**(6) వ్యాఖ్యానువాదం:** మూలభాషలోని రచనకు వ్యాఖ్యారూపమైన అనువాదాన్ని వ్యాఖ్యానువాదం అంటారు. మూలంలో ఉండే క్లిష్టమైన విషయాలను సుబోధకమైన అర్థరూపంలో వ్యాఖ్యానించటం ఈప్రక్రియ లక్షణం. దీనినే భాష్యానువాదం అనికూడా అంటారు. మూలంలో చెప్పిన విషయాలను వ్యాఖ్యానించడంలో అనువాదకుడు తన సొంత అభిప్రాయాలను జోడించడం కూడా జరుగుతుంది.

**(7) రూపాంతరీకరణం** (Adoptation): మూలభాషలోని రచనా ప్రక్రియ రూపాన్ని మార్చి లక్ష్యభాషలో అభివ్యక్తీకరించడాన్ని రూపాంతరీకరణం అంటారు. అంటే నాటకాన్ని కావ్యంగానో, కావ్యాన్ని కథగానో అనువదించటం జరుగుతుంది. మహాకవి కాళిదాసు రాసిన 'అభిజ్ఞానశాకుంతలం' మూలంలో నాటకం. దాన్ని పిల్లలమర్రి పినవీరభద్రకవి 'శృంగార శాకుంతలం' అనే పేరిట కావ్యంగా రూపొందించాడు. ఇలా మూలభాషలోని ప్రక్రియారూపాన్ని మార్చి లక్ష్యభాషలో మరో ప్రక్రియలో రాయడమే రూపాంతరీకరణం. ఇందులో అనువాదకుడికి పుష్కలంగా స్వేచ్ఛ ఉంటుంది.

**(8)ఆశు అనువాదం:** ఒక ఉపన్యాసకుడు ఒక భాషలో చెబుతున్న విషయాన్ని అప్పటికప్పుడు అనువదించటం ఆశుఅనువాదం అనిపించుకుంటుంది. అనువాదకుడు మూలభాషలోని విషయాన్ని అప్పటికప్పుడు విని, గ్రహించి, ఆవిషయాన్ని జనరంజకంగా, ఆసక్తికరంగా చెప్పగలిగి ఉండాలి. మూలఉపన్యాసకుడి ఉపన్యాసధోరణిని, భావావేశాన్ని, చమక్కులను, వ్యంగ్యోక్తులను గ్రహించి, వాటిని వీలయినంతమటుకు యథాతథంగా చెప్పగలిగి ఉండాలి. అయితే సాధారణంగా ఆశు అనువాదంలో కొంత జోడించటం, కొంత పరిహరించటం జరుగుతూ ఉంటుంది.

దుబాసి చేసేపని కూడా దాదాపు ఆశు అనువాదం లాంటిదే. అయితే ఆశుఅనువాదకుడి ముందు వందలాదిమంది శ్రోతలు ఉంటే, దుబాసీ ఇద్దరువ్యక్తుల మధ్య జరిగే సంభాషణలను పరస్పరం అర్థమయ్యే విధంగా అనువదించి (వివరించి) చెబుతాడు.

అనువాద ప్రక్రియలో ఇన్నివిధాలు ఉన్నప్పటికీ అన్నింటిలోను మూలభాషలోని భావాన్ని, విషయాన్ని (matterను) వీలయినంతమటుకు లక్ష్యభాషలో సమతుల్యంగా, లక్ష్యభాషకు అనుగుణంగా అభివ్యక్తీకరించగలగడమే అనువాదకుడి లక్ష్యసాధనకు పరమావధి. అంటే మూలభాషలోని రచన, చదువుతున్నప్పుడు ఆ భాష పాఠకుడి మనస్సును ఏవిధంగా ప్రభావితం చేస్తుందో, అదే విధంగా అనువాదం కూడా లక్ష్యభాష పాఠకుణ్ణి ప్రభావితం చేయగలగాలి. అనువాదంలా అనిపించకుండా సాఫీగాసాగిపోయే అనువాదమే ఆదర్శ అనువాదం.

# అనువాదం - పాఠకుడు

అనువాదం చేసేటప్పుడు పాఠకుణ్ణి కూడా దృష్టిలో ఉంచుకోడం న్యాయసంగతం అవుతుంది. అనువాదాన్ని చదివే పాఠకులు మూడురకాలుగా ఉంటారు. 1.మూలభాష, లక్ష్యభాష తెలిసి లక్ష్యభాషలోని అనువాదాన్ని తులనాత్మక దృష్టితో చూసే పాఠకులు. 2.మూలభాషలో ప్రసిద్ధి చెందిన రచనల గొప్పదనాన్ని అర్థం చేసుకునే దృష్టితో, సాహిత్యాభిరుచితో అనువాదాన్ని చదివే పాఠకులు. 3.మూలభాషలోని గ్రంథాల విషయజ్ఞానం పొందగోరే పాఠకులు.

మొదటిరకం పాఠకుడు మూలభాషను, మూలగ్రంథాన్ని క్షుణ్ణంగా చదివి అందులో ఉన్న భావవైశిష్ట్యం, పదప్రయోగ వైశిష్ట్యం (Matter and Manner) లక్ష్యభాషలో చక్కగా అనూదితమయ్యాయా లేదా అని పరిశీలిస్తాడు. ఒకే మూలరచనను చాలామంది అనువాదకులు తమ తమ వ్యక్తిగత అభిరుచులు ఆధారంగా అనువదిస్తుంటారు. ఒకే రచయిత రచనను నలుగురైదుగురు అనువాదకులు ఒకే లక్ష్యభాషలో అనువదించిన సందర్భాలు కోకొల్లలు. అయితే ఒకే రచనకు వారు చేసిన అనువాదాలలో తేడాలు కూడా ఉన్నాయి.[1] వీటన్నింటిని విద్యావిషయకంగా పరిశీలించి వాటి తారతమ్యాలను పరీక్షించే పాఠకులు తక్కువగా ఉంటారు.

రెండోరకానికి చెందిన పాఠకులు ఎక్కువమంది ఉంటారు. ఈరకం పాఠకులు మూల భాషలో సుప్రసిద్ధమైన రచనల భావ-శైలీ-సౌందర్యాలను ఆకళింపుచేసుకొనే దృష్టితో అనువాదాలను చదువుతూ ఉంటారు. అనువాదంలోని ప్రభావోత్పాదకత ఇటువంటివారిని ఆకట్టుకొంటుంది. వీరు తులనాత్మక పరిశీలకులు కారు. ఉదాహరణకు Fitzerald చేసిన ఉమర్‌ఖయ్యాం అనువాదాన్ని చదివి మెచ్చుకొని రసాస్వాదనం చేస్తారు. దువ్వూరి రామిరెడ్డిగారి 'పానశాల' (ఉమర్ ఖయ్యాం రుబాయిలకు అనువాదం), తెన్నేటి సూరి చేసిన నవలానువాదాలు, 'ఉమ్రావ్‌జాన్ అదా' అనే సుప్రసిద్ధ ఉర్దూనవలకు శ్రీ దాశరథి రంగాచార్యగారు చేసిన అనువాదం, గాలిబ్ రచనలకు కీ.శే. ఆస్థానకవి దాశరథి కృష్ణమాచార్యగారు చేసిన అనువాదాలు ఈకోవకు చెందినవే. ఇటువంటి పాఠకులకు అనువాదం లక్ష్యభాషకు అనుగుణంగా ఉండి, వారిని మెప్పించేదిగా ఉండాలి. ఇటువంటి సందర్భాలలో మూలంలోని కొన్ని విషయాలను సందర్భోచితంగా పరిహరించి లేదా జోడించి అనువాదాన్ని ఔచిత్యభరితంగా, మూలరచన మాదిరిగా ప్రతిభాసింపచేయాలి.

---

1. శ్రీశ్రీ రచించిన 'నగరంలో వృషభం' అనే కవితకు నలుగురు చేసిన అనువాదాలను తులనాత్మకంగా పరిశీలిస్తూ డా. పోలి విజయరాఘవరెడ్డిగారు రాసిన వ్యాసం (అనువాద్-తెలుగు విశేషాంక్- మార్చి-ఏప్రిల్ 1995)

మూడోరకం పాఠకులు కేవలం మూలభాషలోని రచనల పరిచయంకోసం అనువాదాలను చదువుతుంటారు.ఈ రకం పాఠకులకు రూపాంతరీకరణలు, సంక్షిప్తానువాదాలు నచ్చుతాయి. ఉదాహరణకు సంక్షిప్త గద్యరామాయణ, భారత, భాగవతాదులు, పంచమహాకావ్యాల పరిచయాలు మొదలయిన వాటిని పేర్కోవచ్చు. ప్రపంచ భాషలలోని classics ని కేవలం మూలకథను ఆధారంగా తీసుకొని బాలల మానసిక ప్రవృత్తికి అనుగుణంగా రచించిన అనువాదాలు (retold) ఈరకం పాఠకులు చదువుతారు.

మహాకవి షేక్స్పియర్ రచనలు ఎం.ఎ. చదివే వారికోసం అనువదించడం, high school తరగతులలో చదివే వారికోసం అనువదించడం, సాధారణ పాఠకుడి కోసం అనువదించడంలో ఈ తేడా సుస్పష్టంగా కనిపిస్తుంది. అందుచేత అనువాదకుడు ఏ రకం పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొని అనువదిస్తున్నాడో అన్నది కూడా పరిశీలించవలసి ఉంటుంది. వేరువేరు పాఠకుల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని చేసిన అనువాదస్వరూపాలు వేరువేరుగా ఉండటం స్వాభావికం.

# అనువాదం - భాషాశాస్త్రం

అనువాదాన్ని Applied linguisticsలో ఒక అంశంగా పరిగణిస్తారు. అనువాదం మౌలికంగా భాషాంతరీకరణ ప్రక్రియ. అందుచేత అనువాదానికీ భాషా శాస్త్రానికీ అవినాభావ సంబంధం ఉంది. ఒక భాషకు సంబంధించిన వివిధ అంశాలను క్షుణ్ణంగా పరిశీలిస్తేనే ఆ భాషలోని విశిష్ట లక్షణాలు తెలుస్తాయి. అదేవిధంగా మూల, లక్ష్యభాషల వైశిష్ట్యాలు తెలిసినప్పుడే అనువాదం సులువు అవుతుంది. అప్పుడది ప్రామాణికంగా కూడా ఉంటుంది.

అనువాదకుడు మూలభాషలోని ధ్వనులను, వాటి ఉచ్చారణా విధానాలను తులనాత్మక భాషా శాస్త్రపరంగా పరిశీలించాలి. మూలభాషలోను, లక్ష్యభాషలోను కొన్ని ధ్వనులు, వాటి ఉచ్చారణలు పూర్తిగా సమానంగా ఉంటాయి. కొన్ని దాదాపు సమానంగా ఉంటాయి. కొన్ని పూర్తిగా భిన్నంగా ఉంటాయి. కొన్ని ధ్వనులు, ఉచ్చారణలు మూలభాషలో ఉంటాయి. కాని లక్ష్యభాషలో ఉండవు. కాబట్టి అనువాదం చేసేటప్పుడు మూలభాషలోని ధ్వని సంకేతాలను జాగ్రత్తగా గమనించాలి. ఉదాహరణకు ఇంగ్లీషులో Manager, Bank లో ఉన్న ధ్వనులను మనం తెలుగులో యథామూలంగా రాయలేం. అందుచేత తెలుగులో మేనేజర్, బ్యాంకు అనీ, హిందీలో मैनेजर, बैंक అనీ రాస్తారు. కాని ఇవి మూలధ్వనులను యథామూలంగా వ్యక్తీకరించలేవు.

భారతీయ భాషలు ఆర్యభాషలనీ ద్రావిడ భాషలనీ రెండు రకాలు. వీటిలోని అన్ని ధ్వనులు, ఉచ్చారణలో ఒకేరకంగా ఉండవు. వీటిని అంటే మూలభాషలోని ధ్వనులను లక్ష్యభాషలోకి స్వీకరించేటప్పుడు వీటిని యథామూలంగా స్వీకరించాలా? లక్ష్యభాషా స్వభావానికి అనుగుణంగా స్వీకరించాలా? అనేది చర్చనీయాంశం. ద్రావిడ భాషలలో ఉన్న ఎ, ఒ, ళ మొదలయిన ధ్వనులు ఉత్తర భారత దేశపు భాషల్లో లేవు. తెలుగు బదులు తేలుగు అనీ, కళ బదులు కల అని రాస్తారు, ఉచ్చరిస్తారు. స్వాతంత్ర్యం వచ్చిన తరవాత, పూజ్య వినోబాభావే గారు నాగరీలిపి ప్రచారానికి నడుంకట్టిన తరవాత, దక్షిణాది భాషల్లో ఉండే విశిష్ట ధ్వని సంకేతాలకు, నాగరీలిపిలో కూడా ధ్వని సంకేతాలు రూపొందించడం జరిగింది. మూలభాషలోని ధ్వనులను యథామూలంగా కాకుండా లక్ష్యభాషకు అనుగుణంగా స్వీకరిస్తే సమంజసంగా ఉంటుంది.

ఇదే విధంగా ఐరోపా మొదలయిన విదేశీ భాషల ధ్వనులకు, మనదేశ భాషల ధ్వనులకు

సామ్యంలేదు. కాబట్టి విదేశీ ధ్వనులను మనం భారతీయ భాషలలో వ్యక్తీకరించేటప్పుడు వాటిని మూలానుసారంగానే లక్ష్యభాషకు అనుగుణంగా మార్చుకొని రాయాలి. ఉదాహరణకు Thomas అనే నామవాచకాన్ని టామస్ అనకుండా 'థామస్' అనీ, Tolostoy ని 'తోలోస్తోయి' అనకుండా 'టాల్‌స్టాయి' అనీ, Das Kapital ని 'డస్‌కేపిటల్' అనకుండా 'దాస్ క్యాపిటల్' అనీ, Academy ని 'ఎకాడమీ' అనకుండా 'అకాడమీ' అనీ, బ్రహ్మదేశాన్ని బర్మాదేశం అనీ అనడం పరిపాటి అయిపోయింది. ఇలా ఎన్నో పదాలు యూరోపియను భాషలనుంచి మనభాషల ఉచ్చారణ విధానానికి అనుకూలంగా వచ్చిచేరాయి. ఉత్తర భారతదేశంలో గ్రామీణ ప్రాంతాలలో Platform ని 'లాట్‌పారం'అనీ, signal ని 'సింగల్' అనీ అంటారు!

అయితే అనువాదకుడు మూలభాషలోని spelling ను గ్రహించాలా? లేదా ఉచ్చారణ ఆధారంగా గ్రహించాలా? అన్నది పరిశీలించదగ్గ అంశం. ఐరోపాదేశ భాషలలో spellingకు, ఉచ్చారణకు సంబంధం ఉండదు. Could, should లాంటి పదాలలో 'L' పలకరు. girl, world లాంటి పదాలలో 'r'ను పలకరు లేదా తేల్చి పలుకుతారు. But, put లలో 'u' ఉచ్చారణ ఒకేరకంగా ఉండదు. అందుచేత ప్రామాణికమైన ఆంగ్ల భాషా నిఘంటువులలో ఉచ్చారణ కూడా ఇస్తారు. నామవాచకాల ఉచ్చారణ పద్ధతులను గ్రహించి , మూల భాషలోని ఉచ్చారణ ప్రకారం రాయటమే ఉత్తమం అని చాలామంది విద్వాంసుల అభిప్రాయం. కాని ఆ ఉచ్చారణ విధానాలు లక్ష్యభాష ప్రకృతికి అనుగుణంగా మారిపోతూ ఉండటం మనం చూస్తూనే ఉంటాం. మూలభాషలో ఉన్న ఉచ్చారణ లక్ష్యభాషలో ఎలా ఉండాలి? అనే విషయాన్ని చర్చిస్తూ డా. భోలానాథ్ తివారీ బహుళ ప్రచారంలో ఉన్న ఉచ్చారణను స్వీకరించాలని అంటారు. ఇది మూలభాషకు, లక్ష్యభాషకు రెండింటికి వర్తిస్తుంది.

మూలభాషలోని ధ్వనులను, ఉచ్చారణలను, Phonemes ని, Allophonesని గమనించాలి. దీనివల్ల మూలభాషలోని ధ్వనులను చక్కగా అనువదించడానికీ, ఆయాధ్వనులను విని వాటి వైశిష్ట్యాలను గుర్తించి అనువదించడానికీ వీలుపడుతుంది. లిఖిత రూపంలో ఉన్న శబ్దోచ్చారణను మూల భాషలో ఉచ్చారణకు అనుగుణంగా వీలయినంతమటుకు లక్ష్యభాషలో నప్పేటట్లుగా అనువదించాలి.

ధ్వనులకు, లిపి సంకేతాలకు సంబంధించిన ఇంకొక విషయం లిప్యంతరీకరణం (transliteration). మూల భాషలో ఉన్న ధ్వనులను, అక్షరక్రమాలను యథాతథంగా లక్ష్యభాషలో రాయడాన్ని లిప్యంతరీకరణం అంటారు. తెలుగులో ఉన్న కొన్ని ధ్వనులు ఉదాహరణకు ఎ,ఒ,చ,జ,ళ,ఱ మొదలయినవి ఆర్యభాషల్లో లేవు.(ప్రాకృత, అపభ్రంశ భాషల్లో ఉండేవట.) మరి వాటిని హిందీ మొదలయిన ఆర్యభాషల్లో వ్యక్తీకరించాలంటే ప్రత్యేకమైన లిపి చిహ్నాలను ఏర్పరచుకోవాలి[1].

---

1. లక్నోలోని భువనవాణీ ట్రస్టు వారు ప్రపంచంలోని 72 భాషలను నాగరిలిపిలో రాయడానికి వీలుగా ప్రత్యేకమయిన ధ్వని చిహ్నాలను ఏర్పరిచి, ఆయాభాషల వర్ణమాలలను, నాగరి లిపిలో రాయించారు. దాదాపు 100 పుస్తకాలు నాగరీ లిప్యంతరణం, హిందీ అనువాదంతో సహా ప్రచురించారు.

అనువాదంలో ముఖ్యంగా ఎదురయ్యే సమస్య అర్థవిజ్ఞానానికి సంబంధించింది. దీన్ని అర్థవిపరిణామం (semantics) అంటారు. మూలభాషలోని శబ్దాలకు ఉన్న అర్థాలను చక్కగా గ్రహించి, వాటిని లక్ష్యభాషలో సముచితంగా ప్రయోగించాలి.

యూరోపియన్ ఇంగ్లీషుకు, అమెరికన్ ఇంగ్లీషుకు ఉచ్చారణలోనే కాకుండా పదాల అర్థాల్లోకూడా తేడా ఉంది. అమెరికాలో petrol ను gas/gasoline అనీ, lift ని elevator అనీ, Toiletని restroom అని, challan ని ticket అని అంటారు. ఇలాంటివి ఇంకా ఎన్నో ఉన్నాయి. అనువాదకుడు ఇలాంటి పదాల భిన్నార్థాలను జాగ్రత్తగా గమనించాలి. కాలానుక్రమంగా ఒక భాషలోని పదాలకే అర్థాలు మారిపోతూ ఉంటాయి.

సమస్త భారతీయ భాషల్లో సంస్కృతపదాలు విరివిగా వాడుకలో ఉన్నాయి. అయితే ప్రాంతీయ భాషల్లో వాడుకలో ఉన్న సంస్కృతపదాలకు, మూల సంస్కృతంలోని అర్థం ఆధారంగా వేరు వేరు అర్థాలు ప్రచారంలో ఉన్నాయి. తెలుగులో ప్రచారంలో ఉన్న సంస్కృత, అరబ్బీ, ఫారసీ పదాలకు ఉన్న అర్థభేదాన్ని semantic variationsను వివరిస్తూ ప్రొ. జి.ఎన్. రెడ్డిగారు. ప్రామాణికమయిన పుస్తకం రాశారు[1].

తెలుగులో వాడకంలో ఉన్న ఎన్నో సంస్కృత పదాలకు తెలుగులో అర్థం వేరు. హిందీలోను, ఇతర భారతీయ భాషలలో ప్రచారంలో ఉన్న అర్థాలు వేరు. ఉదాహరణకు అనర్గళం అంటే తెలుగులో ధారాప్రవాహం అని అర్థమయితే హిందీలో ప్రేలాపన, వాగుడు అని అర్థం. హిందీలోను, తెలుగులోను ఇలా అర్థభేదం ఉన్న సంస్కృత శబ్దాలు గణనీయంగా ఉన్నాయి.

అనువాదకుడు శబ్ద స్వరూపాన్ని బట్టి కాకుండా మూలభాషలో ప్రయుక్తమౌతున్న అర్థాలను గమనించి, లక్ష్యభాషలో ఆ అర్థాన్నిచ్చే శబ్దాలను వాడాలి. తత్సమ, తద్భవ, దేశ్య, అన్యదేశ్య శబ్దాలకు శబ్ద సామ్యాన్ని బట్టి కాకుండా భాషలోని అర్థాలను, మూల, లక్ష్యభాషలలో ఉన్న అర్థభేదాన్ని గమనించి అనువాదం చేయాలి.

వాక్యంలో వాడే శబ్దాలకు సందర్భాన్నిబట్టి స్థానాన్నిబట్టి, లింగ వచనాలను బట్టి, ప్రత్యయాలనుబట్టి, శబ్దశక్తులను బట్టి, ఊనిక (stress), కాకువు, వ్యంగ్యాలను బట్టి, స్వరస్థాయి (Intonation) ని బట్టి అర్థభేదాలు ఏర్పడుతూ ఉంటాయి. వీటన్నిటిని దృష్టిలో పెట్టుకొన్నప్పుడే ఆ వాక్యంలో ఆ శబ్దానికి ఉన్న అర్థం సుస్పష్టమౌతుంది. ఈ దృష్టితో అనువాదకుడు మూలవాక్యాన్ని, వాక్యంలోని శబ్దాన్ని అర్థం చేసుకొన్నప్పుడు, ఆ అర్థాన్ని వివిధ భంగిమలలో అభివ్యక్తీకరించ గలుగుతారు.

---

1. A study of Telugu sementies - Sri Venkateswara University Publication, Tirupati 1966

Wood అంటే అర్థం వేరు; woods అంటే అర్థం వేరు. అలాగే good అంటే అర్థం వేరు goods అంటే అర్థం వేరు.

ప్రతిభాషలో వాక్య విధానం వేరువేరుగా ఉంటుంది. ఈ వాక్యనిర్మాణ వైచిత్రిని అర్థంచేసుకొని, దాన్ని లక్ష్యభాషలోని వాక్య నిర్మాణ విధానానికి అనుగుణంగా అనువదించాలి.

ఈ విధంగా భాషాశాస్త్రంలోని వివిధ విషయాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసినట్లయితే ఆయా సిద్ధాంతాల ఆధారంగా మూల భాషనుంచి వీలయినంత మటుకు సమతుల్యంగా, లక్ష్యభాషకు అనుగుణంగా అనువాదం చేయడానికి సాధ్యపడుతుంది. కాబట్టి అనువాదకుడికి భాషాశాస్త్ర జ్ఞానం తప్పనిసరిగా ఉండాలి.

## అనువాదం: నిఘంటువులు

భాషాశాస్త్రానికి సంబంధించిన మరో అంశం నిఘంటువు. అనువాదకుడు నిఘంటువులను, పదకోశాలను (glossaries) తప్పనిసరిగా సంప్రదించాలి. అందుచేత ఈ అధ్యాయంలో నిఘంటువులను గురించికూడా తెలుసుకుందాం.

ప్రపంచంలో ప్రప్రథమంగా శబ్దార్థాలను విశ్లేషిస్తూ యాస్కుడు అనే మహర్షి నిఘంటువును నిర్మించాడు. 'నిగంతవ ఏవసంతో నిగమనాగ్ని ఘంటవ ఉచ్చంత ఇత్యౌప మన్యవహ'-అంటే వేదమంత్రార్థాలను నిశ్చయపూర్వకంగా తెలియపరచే 'నిగంతు' అనే శబ్దం నుంచి 'నిఘంటు' పదం ఏర్పడింది. ఆ తరవాత యాస్కాచార్యుడు 'నిఘంటు'కు రాసిన వ్యాఖ్యపేరు 'నిరుక్తం'. ఈవిధంగా శబ్దానికిగల అర్థాన్ని నిశ్చయపూర్వకంగా తెలియజేసే గ్రంథంపేరు 'నిఘంటువు'. దాన్నే శబ్దకోశమని, లెక్సికాన్అని డిక్షనరీ అని అంటారు.

ప్రాచీనకాలంలో పద్యరూపకంగా ఉన్న అమరకోశాదులు, ఈనాడు ప్రచారంలో ఉన్న అకారాదిక్రమంలో ఉన్న నిఘంటువుల వంటివి కాకపోవడంతో మనకు అవసరంవచ్చిన శబ్దాన్ని వెతుక్కోడం కష్టసాధ్యమవుతుంది. పాశ్చాత్యవిద్వాంసులు మనదేశానికి వచ్చి మనభాషలు నేర్చుకొని ఆయా భాషలకు అధునాతన పద్ధతిలో వ్యాకరణ గ్రంథాలు, నిఘంటువులు తయారు చేశారు. ఆ నిఘంటువులన్నీ అకారాదిక్రమం (Alphabetical order)లోనే ఉన్నాయి. అవి ఈనాటి జిజ్ఞాసువులకు ఎంతగానో ఉపకరిస్తున్నాయి. ఈనాటికి దాదాపు 150 సంవత్సరాల క్రితం సర్ చార్లెస్ ఫిలిప్‌బ్రౌను తయారుచేసిన నిఘంటువులు (ఇంగ్లీషు-తెలుగు, తెలుగు-ఇంగ్లీషు) ఈనాటికీ ప్రామాణికంగా ఉన్నాయి. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు తయారు చేసిన 'శబ్దరత్నాకరం' (ప్రథమ ముద్రణ క్రీ.శ. 1885) ఈ కోవకు చెందినదే.

అనువాదకుడికి మూలభాషలోని పదాల అర్థాలను నిశ్చయపూర్వకంగా తెలుసుకోడానికి నిఘంటువు ఎంతగానో ఉపకరిస్తుంది. అయితే నిఘంటువులు ఏ పదాన్ని ఎప్పుడు, ఎలా

వాడాలో తెలియచేయవు. నిఘంటువులో ఇచ్చిన అర్థం ప్రామాణికమని భావించి, అనువాదకులు ఆ పదానికి ఇచ్చిన అర్థాలలో సందర్భోచితమైన అర్థాన్ని గ్రహించి అనువాదకార్యక్రమాన్ని చేపట్టాలి. అంటే అనువాద కార్యక్రమానికి నిఘంటువు నిస్సందేహంగా అత్యవసరం. నిఘంటువును చూసి, శబ్దార్థాలను తెలుసుకోడం అనువాదకుడి ప్రథమ కర్తవ్యం.

Minister అనే పదానికి మనదేశంలో 'మంత్రి' అనే అర్థం ఉంది. కాని Native ఇంగ్లీషులో Minister అనే పదానికి clergyman అనే అర్థం ఉంది. Clergyman అంటే మతగురువు. Ministerకు గల ఈ అర్థాన్ని తెలుసుకోవాలంటే శ్రద్ధగా, ఓపికతో నిఘంటువులను చూడవల్సిందే. ఇలా భ్రమోత్పాదకమైన పదాలు ఎన్నో ఉన్నాయి. వాటి అర్థాలను నిశ్చయపూర్వకంగా తెలుసుకోడానికి అనువాదకుడికి వ్యావహారిక జ్ఞానం ఉండాలి. దానితోపాటు నిఘంటువులను తిరగవేసే అలవాటు, ఓపిక తప్పనిసరిగా ఉండాలి.

ఈ విధంగా ఒకే భారతీయ భాషా సమూహానికి, సాంస్కృతికంగా మూల భాష అయిన సంస్కృత పదాలకు విభిన్న భాషలలో ఉన్న అర్థభేదాన్ని గుర్తించి, సందేహం కలిగినపుడు అనువాదకుడు నిఘంటువులో శబ్దార్థాన్ని సరిచూసుకోడం సముచితం.

నిఘంటువులు వ్యాకరణ విశేషాలను, ఉచ్చారణ విశేషాలను కూడా తెలుపుతాయి. లింగ, వచన, విశేషణ, జాతీయాలు, నుడికారాలు మొదలయిన విశిష్ట రూపాల అర్థాలను తెలుసుకోడానికి నిఘంటువులు అనువాదకుడికి ఎంతగానో ఉపకరిస్తాయి.

అయితే నిఘంటువులు పదాల అర్థాలను తెలియపరుస్తాయేకాని వాటి లక్ష్యార్థాలనూ, సూచనార్థాలను, వ్యంగ్యార్థాలను తెలియజేయవు. ఏ సందర్భం (context) లో, ఏ పదం ఎప్పుడు, ఎలా వాడబడిందో తెలుసుకోడం అనువాదకుడి కర్తవ్యం. తరవాత ఆ పదానికి గల అర్థాన్ని గ్రహించి, ఆ అర్థానికి అనుగుణంగా లక్ష్యభాషలోని పదాన్ని వాడాలి.

నిఘంటువుల సహాయంతో కూడా పదాలకు అర్థాలు తెలియనప్పుడు అనువాదకుడు విజ్ఞులను అడిగి తెలుసుకోడానికి సంకోచపడకూడదు.

8

# సాహిత్యానువాద సమస్యలు

'సినీవాలి' అనే కవితాసంకలనంలో 'మహాకవి ఆరుద్ర' కవిత్వానికి 'ఏం చెబుతున్నావు? ఎలా చెబుతున్నావు?' అనేవి రెండు ప్రధానాంశాలని అన్నారు. అంటే కవిత్వంలో భావ పక్షం ఎంతప్రధానమో, కళాపక్షం కూడా అంతే ప్రధానం అని స్పష్టమవుతుంది. అలాగే అనువాదంలో కూడా విషయం, విధానం (matter and manner) రెండూ ప్రధానాంశాలే. అలాగే సాహిత్య సంబంధమైన గ్రంథాల అనువాదంలో విషయం (matter) తోపాటు విధానం (manner) కూడా ప్రాముఖ్యాన్ని సంతరించుకొంటుంది. అంటే కవి తను చెప్పదలచుకున్న విషయాన్ని ఏవిధంగా, ఏ రూపంలో అభివ్యక్తీకరించాడన్నది అనువాదకుడు జాగ్రత్తగా గమనించి, లక్ష్య భాషలో విషయంతోపాటు విధానాన్నికూడా అభివ్యక్తీకరించడానికి శాయశక్తుల ప్రయత్నం చేయాలి. శాస్త్రీయ, వైజ్ఞానిక గ్రంథాల అనువాద సందర్భంలో manner కంటే matter ప్రధానం. అంటే విషయమే ప్రధానం కాని దాన్ని చెప్పే పద్ధతి ప్రధానం కాదు. శాస్త్రీయ వైజ్ఞానిక గ్రంథాలలో ఉన్న విషయాన్ని యథాతథంగా అనువదించడం అనువాదకుడి ప్రధానకర్తవ్యం. దీన్ని దృష్టిలో పెట్టుకొని అనువాద శాస్త్రవేత్తలు తథ్యప్రధాన శైలి, కథన ప్రధానశైలి అని అనువాదాన్ని రెండు పద్ధతులుగా విభజించారు. శాస్త్రీయ గ్రంథాలను అనువదించేటప్పుడు తథ్యప్రధానశైలినీ సాహిత్య గ్రంథాలను అనువదించేటప్పుడు కథన ప్రధానశైలినీ అనుసరించాలని స్పష్టంచేశారు.

సాహిత్య గ్రంథాలను అనువదించేటప్పుడు ఎదురయ్యే సమస్యలూ శాస్త్రీయ గ్రంథాలను అనువదించేటప్పుడు ఎదురయ్యే సమస్యలూ వేరువేరుగా ఉంటాయి.

సాహిత్యంలో కవిత్వానికి ఉన్న ప్రాముఖ్యాన్ని ఎవరూ కాదనలేరు. కవి తను చెప్పదలచుకున్న భావాన్ని ఏవిధంగా, ఏ రూపంలో అభివ్యక్తీకరించాడో అన్న విషయాన్ని అనువాదకుడు హృదయంగమం చేసుకోవాలి. అంటే కవి ఏ పరిస్థితిలో, ఏ నేపథ్యంలో స్పందించి కవితా సృజనం చేశాడో, అతని మానసిక పరిస్థితి ఎటువంటిదో, ఆనాటి సామాజిక, సాంస్కృతిక పరిస్థితులు ఎటువంటివో, కవి భావస్ఫూర్తికి, పాండిత్య ప్రకర్షకు ఉన్న స్థానం ఎటువంటిదో, మొదలయిన విషయాలన్నింటిని అనువాదకుడు సమగ్రంగా ఆకళింపుచేసుకోవాలి. తదనురూపంగా మూలకవి భావగాంభీర్యానికి, అభివ్యక్తీకరణశైలికి ఎటువంటి లోపం కలగకుండా లక్ష్యభాషలో ఆ భావగాంభీర్యాన్ని, ఆ అభివ్యక్తి శైలిని ప్రస్ఫుటం చేయగలగాలి.

కాళిదాసు చెప్పినట్లు కావ్యసృష్టిలో శబ్దార్థాలకున్న అవినాభావ సంబంధం[1] మరి ఏ ఇతర సాహిత్య ప్రక్రియలో ఉండదు. కావ్యానువాదం అసంభవమని జాన్సన్[2] పండితుడు అన్నాడు. అంటే కవి ఒక భావావేశానికిలోనై ఒక విశిష్టమైన మానసిక స్థితి (Mood)లో ఉండి కావ్యరచన చేస్తాడు. ఆ సమయంలో కవి హృదయంలోని భావాలు ఒక విశిష్టమైన శైలిలో అభివ్యక్తమవుతాయి. కాబట్టి మళ్ళీ అటువంటి భావావేశం కలిగినప్పుడు, అటువంటి మానసిక స్థితి (Mood) వచ్చినప్పుడు మాత్రమే మళ్ళీ అటువంటి కవిత రాయగలుగుతాడు. మళ్ళీ అదే విధమయిన భావావేశం, స్పందన కలగడం అసంభవం కాబట్టి అటువంటి కవిత మళ్ళీ రాయడం కూడా అసంభవం. దీన్ని దృష్టిలో ఉంచుకునే జాన్సన్ మహాశయుడు పైవిధంగా అన్నాడు.

గ్రీకుభాషలో 'A translator is a traitor' అనే నానుడి ఉంది. అనువాదకుడు ద్రోహి అంటే మూలానికి న్యాయం చేకూర్చలేడు, మూలంలో ఉండే content ,matter ను manner of expression ను మూలానుసారంగా లక్ష్యభాషలో అభివ్యక్తీకరించలేడు అని అభిప్రాయం. మూలభాషలో పాఠకుడు ఆ కవితను చదివి ఏవిధంగా ప్రతిస్పందిస్తాడో ఆ విధంగా అనువాదకుడు లక్ష్యభాషలో పాఠకుణ్ణి ప్రతిస్పందింపచేయలేడు అని అర్థం.

డాంటే అనేకవి 'The flowering moments of the mind drop half their petals in speech and three fourths in translation' అని అన్నాడు. అంటే కవి మనస్సులో కలిగిన భావోద్రేకంలో సగభాగం మాత్రమే రచనలో అభివ్యక్తమవుతుంది. అనువాదంలో అందులో మూడొంతులు లుప్తమైపోతుంది అని అర్థం.

H.Deforest smith అనే విమర్శకుడు translation of a literary work is as tasteless as a stewed strawberry అని అన్నాడు. అంటే సాహిత్యానువాదం రసహీనమై ఉంటుందని ఆయన అభిప్రాయం.

Sydney అనే విమర్శకుడు 'Ideas can be translated but not the words and their associations' అని అన్నాడు. అంటే భావాలు (matter, content) అనువాద సాధ్యమవుతాయి కాని విశిష్ట పదప్రయోగాలు, ఆ పదప్రయోగాలలో ఉండే పరస్పర సంబంధాలు లక్ష్యభాషలో అభివ్యక్తీకరించడం అసాధ్యం. ఇలా ఎంతోమంది విమర్శకులు సాహిత్యానువాదం, అందులోనూ కావ్యానువాదం అసాధ్యమనీ అసంభవమనీ చెబుతూ వచ్చినా ప్రపంచ భాషల్లో అసంఖ్యాకంగా కావ్యానువాదాలు జరిగాయి, జరుగుతున్నాయి. అంటే ఇతర భాషల్లోని కావ్యరచనల్లో ఉన్న వైశిష్ట్యాన్ని తెలుసుకుందామనే ఆకాంక్ష నెరవేరడానికి అనువాదమే ఏకైక సాధనం. ప్రపంచంలోని వందలాది భాషల్లో వెలువడే ఉత్కృష్ట రచనలను ఇతర భాషా పాఠకులకు అందించే సాధనం అనువాదం. కాబట్టి అనువాదాలను ఎంత తిరస్కారభావంతో

---

1. వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే!
   జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥ (రఘువంశం 1-1)
2. Poetry cannot be translated in its own language.

చూసినా అవి సాహిత్య రసాస్వాదన ప్రియులకు, జ్ఞాన పిపాసువులకు అనివార్యమైనవి. దీన్ని దృష్టిలో ఉంచుకొనే ఉమర్ ఖయ్యాం రుబాయిలను ఇంగ్లీషులోకి అనువదించిన Fitzreld ఇలా అన్నాడు: I am persuded that... translator...must recast the original into his own likeness.... the live dog is better than the dead lion. (అనువాద విజ్ఞాన్-డా. బోలానాథ్ తివారీ. - పేజి 190)

అంటే మూలంలో ఉండే సమస్త విషయాలను-భావసంపదను శబ్దసౌందర్యాన్ని-సంపూర్ణంగా లక్ష్యభాష పాఠకులకు అందించలేకపోయినా మూల రచన వైశిష్ట్యాన్ని ఆభాసమాత్రంగానైనా అందించగలుగుతుంది అనువాదం. మూలం మూలమే. అనువాదం అనువాదమే. దీనిని గుర్తుంచుకొని అనువాదరచనను చదివి ఆ రూపంలోనే దానిని గ్రహించాలి. అనువాదం మూల భాషలోని శబ్ద, అలంకార, ధ్వని, ప్రయోగాల వైశిష్ట్యాన్ని యథాసాధ్యంగానే, అనువాదకుడి వ్యక్తిత్వ వైశిష్ట్యం ఆధారంగానే లక్ష్యభాష పాఠకుడికి అందించగలుగుతుంది. అనువాదాన్ని పఠనీయంగా చేయాలంటే అనువాదకుడు అవసరాన్నిబట్టి మూలంలోని కొన్ని అంశాలను వదలిపెట్టాల్సి ఉంటుంది. లక్ష్యభాష స్వభావానికి అనుకూలంగా ఉండే కొన్ని విషయాలను జోడించాల్సి ఉంటుంది అని డా. భోలానాథ్ తివారీ అభిప్రాయం. అనువాదం faithful గా ఉంటే (మూలానుసారంగా ఉండాలంటే) beautiful గా ఉండటం అసాధ్యం. beautiful గా ఉండాలంటే faithfulగా ఉండటం అసంభవం.[1] అన్ని విషయాల మాదిరిగా ఇక్కడ కూడా అనువాదకుడు మధ్యేమార్గాన్ని ఎన్నుకోవాలి. అందుకనే అనువాదం 'కత్తిమీదసాము వంటిది' అన్నారు.

1) కావ్యానువాదంలో సందర్భోచితంగా వాడిన శబ్దాలను వీలయినంతమటుకు లక్ష్యభాషలో అదే ప్రభావాన్ని కలిగించే విధంగా వాడాలి. 2) మూలంలో కవి ప్రయోగించిన అలంకారాలను యథాతథంగా అనువదించడం అసాధ్యం కాబట్టి వాటిని తగినవిధంగా మార్చుకోవాలి. 3) కావ్యానికి ప్రాణం ఛందస్సు. కాబట్టి కావ్యానువాదంలో మూలంలో వాడిన ఛందస్సులో అనువాదం చేయడంకంటే లక్ష్యభాషకు అనుగుణంగా ఉండే ఛందస్సును వాడటం మంచిది. ఛందస్సులోని అంతర్లయను గుర్తించాలి. ఈనాడు చాలామంది అనువాదకులు ఛందోరహితంగా Blank verseలో అనువదిస్తున్నారు. కొంతమంది అనువాదకులు భావానికి ప్రాధాన్యమిస్తూ, మూలరచనను లక్ష్యభాషలో గద్యంగా అనువదిస్తున్నారు. గద్యానువాదం మూలంలోని గతిలయలను, తాళబద్ధతను అభివ్యక్తీకరించలేదు. గద్యానువాదం కేవలం

---

1. If a woman is beautiful she is not faithful and if faithful, not beautiful. Translation is like a woman, if beautiful not faithful, if faithful not beautiful అనువాద విజ్ఞాన్ - డా. భోలానాథ్ తివారి - పేజి 171.

మూలంలోని భావాన్ని అర్థంచేసుకోడానికి ఉపకరిస్తుందేతప్ప మూలంలోని రచనాప్రభావోత్పాద కతను పాఠకుడికి అందించలేదు.

సుప్రసిద్ధకవులూ, విమర్శకులూ అయిన శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ కావ్యానువాద ప్రాశస్త్యాన్ని వివరిస్తూ ఇలా అన్నారు.[1]

'భాషవేరు, కవిత్వం వేరు. అయితే కవిత్వం అలంకార బింబ ప్రతీకాత్మక ద్రవ్యం అయితే అట్టి అలంకార బింబ ప్రతీకలను ఒక భాషలో నుంచి మరోభాషలోకి తీసుకుపోవడమే అనువాదం. అనువాదంలో మనమనుకునే భాషాపరమైన సమస్యలు మనలో పారంపరికంగా, గతానుగతికంగా వస్తున్న భ్రాంతులు. అవి నష్టమైనా కవిత్వానికి నష్టంలేదు. కానీ మూలంలో ఉన్న భాషావిశేషాల్ని కూడా అనువాదంలో తీసుకురావడం కృషిబద్ధుడైన, జాగరూకుడైన, కార్యాళువైన అనువాదకుడికి అసాధ్యం కాదని నా కావ్యాల అనువాద కృషిలో నేను గడించిన అనుభవాన్ని బట్టి తెలుసుకున్నాను. మూలభాషలో ఉన్న కోమల స్వరాలు, నాజూకు ప్రతిధ్వనులు బుద్ధిబలంతో వెతకాలే గానీ అవి అనువాదభాషలో కూడా ఉంటాయి. కారణం, సాధారణంగా మానవసన్నివేశాలన్నీ ఏదేశంలోనైనా సమానంగానే ఉంటాయి. ఆ సన్నివేశాల్లో ఉత్పన్నమయ్యే సంవేదనాత్మక అభివ్యక్తులు కూడా సమానంగానే ఉంటాయి. ఆ అభివ్యక్తుల భంగిమ భిన్నంగా కన్పించవచ్చు. ఆ భిన్నతే అనువాదకుణ్ణి అలాంటి అభివ్యక్తి అనువాద భాషలో లేదనే భ్రాంతికి గురిచేయవచ్చు. కానీ జాగ్రత్తగా భాషా ప్రవర్తన, భాషాశీలము గ్రహించగలిగిన మర్మజ్ఞులకు సమానాంతర అభివ్యక్తులు అన్ని భాషల్లోనూ దొరుకుతాయి. ఆ మర్మజ్ఞత యొక్క ఆవశ్యకతే అనువాదాన్ని అనువాద కళగా మారుస్తుంది.'

అసలు కావ్యానువాదం చేయడానికి అనువాదకుడు కవిహృదయం కలిగినవాడై ఉండాలి. మూలకావ్యాన్ని చక్కగా ఆకళింపు చేసుకొని, దానిలోని భావసౌందర్యాన్ని, పదప్రయోగ చమత్కృతిని హృదయంగమం చేసుకొని లక్ష్యభాషా స్వభావానికి అనుగుణంగా ఆ కావ్యాన్ని మళ్ళీ రచించాలి. అందుచేతనే జ్ఞానపీఠ బహుమతిగ్రహీత, పద్మభూషణ్, సుకవిపుంగవులయిన ఆచార్య శ్రీ సి.నారాయణరెడ్డిగారు కావ్యానువాదాన్ని పునఃసృష్టి, పునర్రచన అని అన్నారు. ఇలాంటి అనువాదాలు కవిత్రయ భారతంలా, పోతన భాగవతంలా అజరామరాలై ఉంటాయి.

నాటకానువాదానికి కొన్ని విశిష్ట సమస్యలున్నాయి. ఎందుకంటె నాటకం పాఠ్యమేకాక ప్రదర్శన యోగ్యత కూడా కలిగి ఉంటుంది. నాటకంలో సంభాషణలు ప్రథమస్థానం వహిస్తాయి. ఆ సంభాషణలు భావ గాంభీర్యంతో కూడి శబ్దచమత్కారం కలిగి ఉంటాయి. ఆ సంభాషణా

---

1. కాలరేఖలు - శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ - పేజీ 47
2. అనువాద విజ్ఞాన్ - డా. భోలానాథ్ తివారి - పేజీ 17

వైచిత్రి సామాజికులను (ప్రేక్షకులను) ఆకట్టుకొంటుంది. కాబట్టి నాటకానువాదంలో ఈ సంభాషణా వైచిత్రి ప్రాధాన్యతను సంతరించుకుంటుంది. అనువాదకుడు ఈవిషయాన్ని గ్రహించి ఒకవైపు రంగస్థలాన్ని (stage), మరోవైపు ప్రేక్షకులను దృష్టిలో ఉంచుకొని అనువాదం సాగించాలి.

నవల, కథానిక, వ్యాసం, విమర్శ మొదలయిన గద్యప్రక్రియలను అనువదించడంలో కొన్ని సమస్యలున్నాయి. నవల,కథ ఈరెండింటిలో సామాజిక, సాంస్కృతిక నేపథ్యం ప్రధానాంశంగా ఉంటుంది. కాబట్టి దానిని అర్థం చేసుకొని తదనుగుణంగా అనువాదం చెయ్యాలి. ఇంగ్లీషు భాషలో spring అంటే కలిగే భావన - స్పందన 'వసంతం' అనగానే కలగదు. అలాగే వర్ణనలు, సంభాషణలు మొదలయిన వాటిని సందర్భోచితంగా అనువదించాలి.

విమర్శకు సంబంధించిన అనువాదంలో సాహిత్యశాస్త్రానికి సంబంధించిన పారిభాషిక పదాలను దృష్టిలో ఉంచుకోవాలి. అనువాదకుడికి సాహిత్యశాస్త్ర సంప్రదాయాలను గురించిన చక్కటి అవగాహన ఉండాలి.

దూరదర్శన్‌లో episodes బాగా ప్రచారంలోకి వచ్చినతరవాత ప్రస్తుతం dubbing కూడా ప్రాధాన్యత సంతరించుకుంది. ఈరకమైన అనువాదంలో పాత్రల పెదవుల కదలిక, సమయాన్ని(time length) జాగ్రత్తగా గమనించాలి. ఇది కొత్తగా ప్రచారంలోకి వస్తున్న సాహిత్యానువాద ప్రక్రియ.

సాహిత్యరచనలను అర్థం చేసుకోడానికి ముఖ్యంగా మూలరచయిత భావాన్ని, అతని మానసికస్థితిని, అతను వాడిన పదప్రయోగ శైలిని అధ్యయనం చేయాలి. ఆయా రచనలను అనువదించేటప్పుడు కూడా అనువాదకుడు ఈ మూడింటిని తన అనువాదంలో ప్రస్ఫుటీకరించే ప్రయత్నం చేయాలి. అప్పుడే ఆ అనువాదం మూలరచన మాదిరిగా ప్రభావోత్పాదకంగా ఉంటుంది.

ఈ విధంగా సాహిత్య విషయాలకు సంబంధించిన అనువాద సమస్యలను క్షుణ్ణంగా అర్థం చేసుకొని అనువాదకుడు అనువాదకార్యానికి ఉపక్రమిస్తే చక్కని అనువాదం అందించగలుగుతాడు.

# అనువాదం - నుడికారాలు - సామెతలు

ప్రతిభాషలోను నుడికారాలు (జాతీయాలు), సామెతలు మొదలయిన వాటిని వాడటం వల్ల చెప్పదలచుకున్న విషయం క్లుప్తంగాను, సుస్పష్టంగాను ఉండి, పాఠకుడి మనస్సును ఆకట్టుకుంటుంది. ఒకరకంగా చెప్పాలంటే నుడికారాలు, సామెతలు భాషకు ప్రాణం లాంటివి.

ప్రతిభాషలోను రచయితలు తమ రచనలను ప్రభావోత్పాదకంగా చేయడానికి అలంకారాల మాదిరిగా జాతీయాలను, సామెతలను వాడుతూ ఉంటారు. జాతీయాలు, సామెతలు జానపద గేయాలమాదిరిగా నిత్య వ్యవహారం మీద ఆధారపడి పుట్టుకొచ్చినవే. 'పెద్దలమాట చద్దిమూట' అన్నట్లు భాషలో ఉండే జాతీయాలు భావస్ఫోరకాలై పాఠకుణ్ణి ప్రభావితం చేస్తాయి.

లోగడ చెప్పినట్లుగా మూలభాషలోని భావాలను వీలయినంతమటుకు యథాతథంగా లక్ష్యభాషలో అభివ్యక్తీకరించడమే అనువాదం. అలాంటప్పుడు మూలరచనలో రచయిత ప్రయోగించిన జాతీయాలను, సామెతలను యథాతథంగా అనువదించడం వల్ల మూల రచయిత రచనాకౌశలం పాఠకుడికి అర్థమవుతుంది.

జాతీయాలు, సామెతలు ఒక్కో దేశపు సంస్కృతి-సంప్రదాయాలమీద ఆధారపడి ఉంటాయి. కాబట్టి ఆయా సంస్కృతులపట్ల అనువాదకునికి అవగాహన ఉండాలి. ఒకే సంస్కృతికి సంబంధించిన రెండు భాషల్లో ఒకే భావాన్ని వ్యక్తీకరించే జాతీయాలు, సామెతలు కనిపించవు. సంస్కృతులు, సంప్రదాయాలు వేరయినప్పుడు సమానార్థకమైన నుడికారాలు, సామెతలు కనిపించవు. హిందీ-తెలుగు భాషల్లో పరస్పరం అనువాదం చేసేటప్పుడు, రెండు భాషలు ఒకే సంస్కృతికి, సంప్రదాయానికి, ఒకేరకమైన సాహిత్య సంప్రదాయాలకు సంబంధించినవి కాబట్టి సమానార్థకాలైన నుడికారాలు, సామెతలు కనిపిస్తాయి.

తెలుగులో 'చెవిటి వాడిముందు శంఖం ఊదినట్లు' అన్న జాతీయానికి హిందీలో **'भैंस के सामने बीन बजाना'** అన్న జాతీయం వ్యవహారంలో ఉంది. అదే భారతీయ భాషలనుంచి ఐరోపా దేశభాషలలో పరస్పరం అనువాదం చేయవలసి వచ్చినపుడు జాతీయాలు అనువదించడం అసాధ్యమవుతుంది. అటువంటి సందర్భాలలో అనువాదకుడు తికమకపడటం స్వాభావికమే. మరి ఈ సమస్యను పరిష్కరించడం ఎలా?

అనువాదశాస్త్రం గురించి చక్కటి పుస్తకం రాసిన కీ.శే. డా. భోలానాథ్ తివారీ జాతీయాల-సామెతల అనువాద సమస్యను పరిష్కరించడానికి నాలుగు మార్గదర్శక సూత్రాలను సూచించారు.

**అవి-**

(1) సజాతీయాలైన భాషలలో సమానార్థకాలైన జాతీయాలు, సామెతలు లభిస్తాయి అని చెప్పుకొన్నాం కదా! అటువంటి సందర్భాలలో అనువాదకుడు వీలయినంతమటుకు భావంలోనూ, శబ్దంలోనూ సమానరూపం కలిగిన జాతీయాలను, సామెతలను ఎన్నుకోవాలి. ఉదాహరణకు 'కాకిపిల్ల కాకికిముద్దు' అనే సామెతను హిందీలోకి అనువాదం చేసేటప్పుడు దానికి సమానమైన 'कौवें का बच्चा कौवे को प्यारा' అనే జాతీయాన్ని ఎన్నుకోవాలి.

తెలుగులో 'గంతకు తగ్గ బొంత' అంటే హిందీలో అదే భావాన్ని 'जैसा छिद्र वैसा चादर' అంటారు.

'తోడుదొంగలు' అనే తెలుగు మాటను హిందీలో 'चोर चोर चचेरे भाई' అని అంటారు.

'ఇంటికోడి పప్పుతో సమానం' అని తెలుగులో అంటే హిందీలో 'घर की मुर्गी दाल बराबर' అంటారు. ఇలా రూపంలోను, భావంలోను సమతుల్యమైన జాతీయాలను, సామెతలను ఎన్నుకోడానికి అనువాదకుడు ప్రయత్నించాలి.

(2) రూపంలోను, భావంలోను సమతుల్యమైన జాతీయాలు, సామెతలు లభించనప్పుడు అనువాదకుడు రూపాన్ని వదిలిపెట్టి, భావసామ్యం ఉన్న జాతీయాలను, సామెతలను ఎన్నుకోవాలి. ఏకసంస్కృతికి సంబంధించిన భాషలలో భావసామ్యం ఉన్న జాతీయాలు, సామెతలు సులభంగా దొరుకుతాయి. విజాతీయ సంస్కృతికి సంబంధించిన భాషల నుంచి అనువాదం చేసేటప్పుడు ఇలాంటి జాతీయాలను, సామెతలను ఎన్నుకోడం కష్టసాధ్యమవుతుంది. అప్పుడు వీలయినంతమటుకు భావసామ్యానికి ప్రాధాన్యమివ్వవలసి ఉంటుంది.

తెలుగులో 'చెవిటివాని ముందు శంఖం ఊదినట్లు' అనే భావాన్ని హిందీలో 'भैंस के सामने बीन बजाना' అని అనవచ్చు. 'చేతులు కాలినాక ఆకులు పట్టుకొన్నట్లు' అనేదాన్ని 'चिडियन युग गइ खेत अब पछतावत क्या होवत है' అని అనవచ్చు. 'గొంగడి ఉన్నంత వరకు కాళ్ళు చాపుకోడం' 'चादर देखकर पैर फैलाना' అని అనవచ్చు. తెలుగులో 'గుడ్డిలో మెల్ల' అనేదాన్ని హిందీలో 'अंधों में काना राजा' అంటే, ఇంగ్లీషులో 'something is better than nothing' అని అనువదించవచ్చు. 'గంగలో మునిగినా కాకి హంస అవుతుందా?' అని తెలుగులో అంటే, హిందీలో 'खर को गंगा नहाइए तऊ न छोडे खार' అని అంటారు.

'తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డబేరం' అని తెలుగులో అంటే, హిందీలో 'पहले अपने घर दिया जलाइए फिर मंदिर में' అని అంటారు.

(3) రూపంలోను, భావంలోను సమానమైన జాతీయాలు-నుడికారాలు లభించనప్పుడు అనువాదకుడు మూలరచనలో వాడిన జాతీయాలలోని, సామెతలలోని భావాన్ని విడమరిచి చెప్పాలి. ఇలా అర్థం చెప్పినప్పుడు జాతీయాల-సామెతల ప్రయోగంలో ఉండే ప్రభావోత్పాదకత తగ్గిపోయే ప్రమాదం ఉంటుంది. కాబట్టి ఆ అర్థమిచ్చే పదబంధం వాడటానికి ప్రయత్నించాలి.

'వాడి పెండ్లి చేస్తానని' అంటే వాణ్ణి శిక్షిస్తానని అర్థం వస్తుంది. దీనికి సమానంగా హిందీలో 'उसकी खबर लूँगा' అని అంటారు.

'పచ్చిమోసగాడు' అంటే హిందీలో कच्चा కాకుండా 'पक्का धोखेबाज' అంటారు.

(4) చివరిగా డా. భోలానాథ్ తివారీ అతికష్టసాధ్యమైన నాల్గో మార్గాన్ని సూచించారు. కొత్తగా జాతీయాన్ని లేదా సామెతను రూపొందించడం. ఇది సహజ ప్రతిభాపాటవం ఉన్న మూలరచయిత (original writer) కే సాధ్యపడుతుంది. సగటు అనువాదకుడు ఈ పని చేయలేడు.

ఇంగ్లీషులోని 'much ado about nothing' అనే పదబంధానికి తెలుగులో 'టీ కప్పులో తుఫాను' అనే పదబంధం రూఢమైపోయింది. ఇలాగే to poke one's nose' అనేదానికి 'తలదూర్చడం' అనేది వ్యవహారంలోకి వచ్చింది. 'To rob peter to pay paul' అనే దానికి తెలుగులో 'కాకుల్ని కొట్టి గద్దలకు వేయడం' అనే నుడికారం చక్కగా సరిపోతుంది.

ఈ విధంగా అనువాదకుడు జాతీయాల, సామెతల భావగౌరవాన్ని, వాటి వ్యంగ్య వైభవాన్ని గుర్తించి పైన చెప్పిన నాలుగు పద్ధతులలో తనకు సాధ్యమయ్యే పద్ధతిని అనుసరించవలసి ఉంటుంది. సాధారణంగా అనువాదకులు మొదటి మూడు పద్ధతులనే అవలంబిస్తుంటారు.

ఇలాంటి జాతీయాల, సామెతల ప్రయోగంలో నిష్ణాతులు కావాలంటే అనువాదకులు మూలభాషలోని, లక్ష్యభాషలోని గ్రంథాలను, రచనలను, నిరంతరం చదువుతూ ఉండాలి. చదువుతూ ఉంటేనే ఒక భాష నుడికారాలు, వాక్యనిర్మాణశైలి వంటబడతాయి. ఇది నిఘంటువులు తిరగవేస్తే అలవడేది కాదు.

10

# అనువాదం - అలంకారాలు

అనువాద ప్రక్రియలో అలంకారాల అనువాదం ఒక జటిలమైన సమస్య. చెప్పదలచుకున్న విషయాన్ని మరింత అందంగా, ప్రభావోత్పాదకంగా చెప్పడానికి రచయితలు అలంకారాలను ఉపయోగిస్తూ ఉంటారు. మూలరచనలోని ఈ అందాన్నీ, ప్రభావాన్నీ (effect) అనువాదంలో కూడా వ్యక్తీకరించాలని అనువాదకుడు ప్రయత్నం చేయాలి.

అలంకారాలు ఏ భాషలోనయినా రెండురకాలు. 1. శబ్దాలంకారాలు 2. అర్థాలంకారాలు. శబ్దాలంకారాలు ఆయా భాషల విశిష్టశబ్దప్రయోగం మీద ఆధారపడి ఉంటాయి. వాటిలో వర్ణాలకు, పదాలకు ప్రాధాన్యం ఉంటుంది. కాబట్టి మూలభాషలో ప్రయోగించిన శబ్దాలంకారాలను లక్ష్యభాషలో యథాతథంగా అనువదించడం అసాధ్యం.

షేక్స్పియర్ వాడిన అనుప్రాసాలంకారయుక్తమైన ఈ వాక్యాన్ని మరో భాషలోకి అదే అనుప్రాసాలంకారయుక్తంగా అనువదించడం సాధ్యపడదు.

'How high his highness holds his haughty head'.

ఈవాక్యంలో 'H' ఎన్నిసార్లు వచ్చిందో, గమనించండి.

అలాగే షేక్స్పియర్ వాడిన ఈకింది పంక్తులను చూడండి.

'April showers

And May flowers.'

ఇక్కడ flowers లో అంత్యానుప్రాసాలంకారమే కాకుండా, రెండు శబ్దాలను (showers, flowers) నామవాచకాలుగానూ, క్రియలుగానూ వాడటం జరిగింది. 'ఏప్రిల్ జల్లులు, మే పువ్వులు' అనాలా? లేదా 'ఏప్రిల్ కురుస్తుంది, మే పూస్తుంది' అని అనాలా? నామవాచకంగానూ క్రియగానూ అర్థమిచ్చే ఒకే పదం ఇతర భాషల్లో దొరకడం కష్టం.

ఇదే విధంగా హిందీసాహిత్యంలో సుప్రసిద్ధుడయిన బిహారీలాల్ రచించిన శబ్దశ్లేషతో కూడి ఉన్న ఈ కింది దోహాను చూడండి.

'అజౌ తర్యౌనాహి రహ్యో, శ్రుతిసేవక్ ఇక్‌సంగ్,

నాక్‌బాస్ బేసరి లహ్యో, బసి ముక్‌తన్‌కే సంగ్'.

(చెవులకు ఉన్న తర్యౌనా (ఒక కర్ణాభూషణం) ఎంతో కాలంగా శ్రుతులను (వేదాలను, చెవులను) సేవించినా, తర్యౌ నా (ముక్తిని పొందలేదు) కాని ముకుతన్ (ముక్తపురుషులు, ముత్యాలు) తో కూడి ఉండటం వలన బేసరి (ముక్కుపుడక) నాక్ (స్వర్గం, ముక్కు) పొందింది.

ఈ దోహాలో ఉన్న అర్థశ్లేష ఇంకో భాషలోకి, భారతీయ భాషలో కూడా అనువదించలేం.

ఇంకో సుప్రసిద్ధుడైన హిందీకవి రహీమ్ (అక్బర్ ఆస్థాన కవి) 'పానీ' అనే శబ్దం వాడి అద్భుతంగా శ్లేషాలంకారాన్ని సాధించాడు.

'రహిమన్ పానీ రాఖియే బిను పానీ సబ్‌సూన్।

పానీ గయే న ఊబరై మోతీ మానుస్ చూన్॥''

ఈదోహాలో 'పానీ' అనే శబ్దాన్ని రహీం కవి మూడు అర్థాల్లో వాడాడు. 'మోతి' (ముత్యం) నీళ్ళు దిగిపోతే, 'మానుస్' (పురుషుడు) పౌరుషం లేకపోతే, 'చూన్' (సున్నం) నీళ్ళులేకపోతే, అవి పనికిరాకుండా పోతాయి. హిందీభాషలోనే ఈదోహాలో 'పానీ'కి పర్యాయవాచకాలయిన 'జల్', 'నీర్'లో ఏది వాడినా, అలంకార సౌందర్యం దెబ్బతిని పోతుంది.

సజాతీయమైన (అంటే ఒకేవిధమైన సంస్కృతి, సంప్రదాయాలకు సంబంధించిన) భాషలలో అర్థాలంకారాలను అనువదించడం కొద్దిగా సులభం. భారతీయ భాషలన్నింటికి సంస్కృత కావ్యశాస్త్రంలో ప్రతిపాదించిన అర్థాలంకారాలే మూలం. కాబట్టి భారతీయ భాషల్లో పరస్పరం అలంకారాల అనువాదం సులభంగా సాధ్యమవుతుంది.

విజాతీయ భాషలయిన పాశ్యాత్యభాషల్లో వాడే అర్థాలంకారాలను భారతీయభాషల్లో అనువదించడం కష్టసాధ్యం. Blue eyes, wise like an owl, as healthy as an horse వంటి ఉపమానాలను వాటిలో ఉండే భావాన్ని గ్రహించి, ఆ భావాన్ని మాత్రం లక్ష్య భాషలో వ్యక్తీకరించడానికి ప్రయత్నం చేయాలి. ఔపమ్యాన్ని ప్రధానంగా తీసుకొని భిన్న ప్రతీకలను, భిన్నార్థాలను గుర్తించి లక్ష్య భాషలో ఉండే భావాభివ్యక్తీకరణకు అనురూపంగా మలచుకొని అనువదించాల్సి వస్తుంది. అలా కూడా వీలు కానప్పుడు మూలభాషలోని అలంకారభావాన్ని యథామూలంగా అనువదిస్తూ, పాదసూచిక (foot note) లో ఆ విషయాన్ని, భావాన్ని వివరించాలి.

కేవలం అర్థంమీదే ఆధారపడి ఉండే జార్జిబెర్నార్డుషా ఛలోక్తులను, హాస్యోక్తులను అనువదించడం సులువు.

# సాహిత్యేతర అనువాద సమస్యలు

అనువాద ప్రక్రియలో కావ్య, నాటక, గద్యరూపాల అనువాద సమస్యలు కథనశైలికి (manner) సంబంధించినవైతే శాస్త్ర, వైజ్ఞానిక గ్రంథాల అనువాద సమస్యలు ముఖ్యంగా విషయానికి (matter) సంబంధించినవి. సాహిత్యాన్ని Literature of power అనీ, శాస్త్ర వైజ్ఞానిక సాహిత్యాన్ని Literature of knowledge అని అన్నారు. సాహిత్యంలో రచయిత భావాన్ని ఎలా చెప్పాడో అన్నది ప్రధానమయితే, శాస్త్ర విజ్ఞాన గ్రంథాలు-అర్థశాస్త్రం, తత్త్వశాస్త్రం, రాజనీతి శాస్త్రం, రసాయనశాస్త్రం, భౌతిక శాస్త్రం, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం మొదలయిన సాహిత్యేతర విషయాలలో భాషకు-అభివ్యక్తీకరణ శైలికి - ప్రాధాన్యం ఉండదు. వాటిలో విషయమే ప్రధానంగాని శైలి ప్రధానంకాదు. విషయాభివ్యక్తీకరణ సుస్పష్టంగాను, అభిధాప్రధానంగాను, అలంకార రహితంగాను ఉంటుంది. అనువాదకుడుకూడా దీన్ని దృష్టిలో ఉంచుకొని (factual) శైలిలో అనువాదం చేయాలి. తన వ్యక్తిగత అభిరుచుల ప్రభావం లేకుండా, కేవలం విషయ ప్రతిపాదనకే ప్రాధాన్యమిస్తూ విషయాన్నే అనువాదం చేయాలి. వ్యంజనాది శబ్దశక్తులు, అలంకారాలు మొదలయినవి లేకపోవడంచేత సాహిత్యేతర విషయాల అనువాదం నూటికి నూరుపాళ్ళు దోషరహితంగా, సుస్పష్టంగా ఉంటుంది.

సాహిత్యేతర విషయాల అనువాదంలో విషయ పరిజ్ఞానం, వాటికి సంబంధించిన పారిభాషిక పదాల పరిజ్ఞానం చాలా అవసరం. లేకపోతే అర్థానికి అనర్థం సంభవించే ప్రమాదం ఉంటుంది. ఉదాహరణకు 'A new plant has been erected in Bhilai' అనే వాక్యాన్ని ఓ అనువాదకుడు 'భిలాయిలో ఒక కొత్త మొక్క నాటబడింది' అని అనువదించాడు. ఇంజనీరింగులో వాడే పదాలతో అట్టే పరిచయం లేకపోవడంతో plant అంటే సాధారణంగా వ్యవహారంలో ఉన్న 'మొక్క' అనే అర్థం గ్రహించాడు. కాని ఇంజనీరింగు విషయ ప్రతిపాదనలో వాడే 'plant' కు అర్థం 'కర్మాగారం, యంత్రాగారం' అని ఊహించలేకపోయాడు.

ఇదేవిధంగా గణితశాస్త్రంలో, భౌతిక శాస్త్రంలో, వృక్ష, జంతుశాస్త్రాల్లో వాడే విషయాలకు అనుకూలమైన పద ప్రయోగాలను, పారిభాషిక పదాలను దృష్టిలో ఉంచుకోవాలి. సాహిత్యేతర గ్రంథాల అనువాదంలో నిఘంటువులనే కాకుండా పారిభాషిక పదకోశాలను (glossaries) వాడుకోడం తప్పనిసరి. వివిధ శాస్త్ర పారిభాషిక పదాలలో ఏకరూపత (uniformity) ఉండదు. ఉదాహరణకు వాణిజ్యశాస్త్రంలో 'interest' అంటే 'వడ్డీ' అని అర్థం. అదే ఇతర సాహిత్య

గ్రంథాలలో 'interest' అంటే 'అభిరుచి' అని అర్థం.

ప్రభుత్వ పరిపాలన, న్యాయ, బ్యాంకింగ్, వాణిజ్య, ఆర్థిక, పత్రికా నిర్వహణ వంటి రంగాలలో జరిగే అనువాదంకూడా సాహిత్యేతర అనువాదం కిందకే వస్తుంది.

స్వాతంత్ర్యం వచ్చిన తరవాత ముఖ్యంగా భాషా ప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడ్డతరవాత ఇంగ్లీషు నుంచి రోజువారీ విషయాలను, శాస్త్ర విజ్ఞాన విషయాలను, ప్రభుత్వ-ప్రైవేటు రంగ సంస్థలకు సంబంధించిన ఎన్నో విషయాలను ఆయా ప్రాంతీయ భాషల్లోకి అనువదించుకోడం జరుగుతున్నది. ఇంగ్లీషు పదాలకు భారతీయ భాషల్లో పారిభాషిక పదాలు రూపొందిస్తున్నారు. ప్రభుత్వ కార్యాలయాల్లో వాడే పదాలకు, రైల్వేలలో, బ్యాంకులలో వాడే పదాలకు ప్రత్యేకమైన పారిభాషిక పదాలను రూపొందించి పదకోశాలు (glossories) తయారుచేశారు.

సాహిత్యేతర అనువాదంలో మూలగ్రంథంలో వాడిన ప్రతీకలనే (symbols) వాడటం సముచితంగా ఉంటుంది.

సాహిత్యేతర గ్రంథాల అనువాదంలో పునఃపరిశీలన (vetting)తప్పనిసరి. అనువాదకుడు తను చేసిన అనువాదాన్ని తాను సరిచూసుకోడమేగాక, ఇంకెవరి చేతనయినా సరిదిద్దించుకోవాలి.

అకాడమీలు సాహిత్యేతర గ్రంథాల అనువాదం చేయించేటప్పుడు ఒక విషయ నిపుణుణ్ణీ (subject expert), ఒక భాషానిపుణుణ్ణీ (language expert) నియమిస్తాయి. వారిద్దరి విషయ పరిజ్ఞానంలోనూ భాషా ప్రయోగంలోనూ మధ్య సమన్వయం కుదిరి అనువాదానికి న్యాయం జరుగుతుంది.

# అనువాదం-పారిభాషిక పదావళి

శాస్త్రీయ-వైజ్ఞానిక విషయాలకు సంబంధించిన అనువాదంలో ముఖ్యంగా ఎదురయ్యేది పారిభాషిక పదాల అనువాద సమస్య. శాస్త్రగ్రంథాలలో ఆయాశాస్త్రాలకు సంబంధించిన పారిభాషిక పదాలు వాడతారు.

పదాలు రెండు రకాలు: 1. సామాన్యంగా వాడుకలో ఉండేవి, 2. విశిష్టమైన అర్థంకోసం వాడేవి. సామాన్యంగా వాడే పదాలు నామవాచకాలు, క్రియలు, క్రియా విశేషణాలు మొదలైనవి. జ్ఞాన విజ్ఞాన శాస్త్రాది విషయాలలో విశిష్టమైన అర్థం కోసం విశిష్టమైన అర్థ పరిధిలో వాడేవి పారిభాషిక పదాలు. పారిభాషిక పదాలు ఒకే అర్థంలో రూఢమయి ఉంటాయి. ఆ శాస్త్ర విషయంలో అదే అర్థంలో ఆ పదాన్ని వాడాలి. ఉదాహరణకు 'ధాతువు' అంటే వ్యాకరణ శాస్త్రంలో verb/root అని అర్థం. ఇంగ్లీషులో root అనే శబ్దానికి సామాన్యంగా అర్థం వేరు, మూలం. కాని వ్యాకరణ సంబంధంగా verb/root అని వాడినప్పుడు దాని అర్థం ధాతువు. ధాతువు లేదా root ఒక విశిష్టార్థంలో ప్రయోగింపబడింది. అంటే ఒక శాస్త్ర విషయంలో ఒక పారిభాషికపదం ఏదో ఒక అర్థంలో నిశ్చితమైపోయి ఉంటుంది. దానికి రెండో అర్థం ఉండటానికి వీలులేదు.

'కండక్ట్' అనే పదం నుంచి ఏర్పడిన కండక్టర్ అనే పదానికి రవాణా శాఖలో బస్సులో టిక్కెట్లు ఇచ్చి బస్సు స్టాప్, స్టార్ట్‌లను కంట్రోల్ చేసేవాడని అర్థం. అదే పదానికి భౌతిక శాస్త్రంలో విద్యుత్తును ప్రవహింపజేసే గుణం ఉన్న పదార్థం అని అర్థం. ఇక్కడ రోడ్డు రవాణా శాఖలో వాడే అర్థాన్ని భౌతిక శాస్త్రంలోనూ భౌతిక శాస్త్రంలో వాడే అర్థాన్ని రవాణా శాఖలోనూ వాడటానికి వీలులేదు. ఈ విధంగా ఒక శాస్త్రంలోగాని, ఒకరంగంలోగాని వాడే పారిభాషిక శబ్దానికి ఆ శాస్త్రంలోగాని, ఆ రంగంలోగాని ఒక అర్థం నిర్దిష్టమై, రూఢమై ఉంటుంది.

గణిత శాస్త్రంలో వాడే పారిభాషికపదాలు, వేదాంతంలో లేదా మానసిక శాస్త్రంలో వాడే పారిభాషిక పదాలు ఆయా భావనల (concepts) మీద ఆధారపడతాయి. అదేవిధంగా Carbon, Radar, Radio , T.V లాంటి పదాలు ఇతర భాషలనుంచి గ్రహించి ఆయా సందర్భాలలో వాడుతూ ఉంటాం. ఆధునిక కాలంలో భాషాశాస్త్రం, అంతరిక్ష విజ్ఞానం మొదలైన రంగాలలో ఎన్నో పారిభాషిక పదాలు ఆయా భావనలకు అనుకూలంగాను, objects కి అనుగుణంగాను వాడుతున్నాం. అవి ఆయా సందర్భాలలో ఒక నిర్దిష్టమైన అర్థానికే పరిమితమై

ఉండటం గమనిస్తున్నాం.

పారిభాషిక పదాలు లక్ష్యభాష స్వభావానికి అనురూపంగానూ, సరళంగానూ ఉండాలి. అంతర్జాతీయ వ్యవహారంలో ఉండే పదాలను స్వీకరించినప్పుడు లక్ష్యభాష ఉచ్చారణకు అనుగుణంగా ఉండేటట్లు చూసుకోవాలి. ఇతర భాషల్లో ముఖ్యంగా ఇంగ్లీషు భాషలో వాడకంలో ఉన్న పారిభాషికపదాలను యథాతథంగా వాడుకోవచ్చునని కొంతమంది విద్వాంసుల అభిప్రాయం. కాలక్రమేణ రోజువారీ వాడకంలో ప్రజలే కొత్త పదాలను సృష్టించుకుంటారు. Dredger అనే పదానికి 'తవ్వోడ'అనే పదం ఇలా పుట్టుకొచ్చిందే.

పారిభాషిక పదాల అర్థం సునిశ్చితంగాను, నిర్దుష్టంగాను ఉండాలి. అతివ్యాప్తి, అవ్యాప్తి, దోషాలు ఉండకూడదు. ఒక శాస్త్రంలోగానీ ఒక రంగంలోగానీ, ఒక conceptకు లేదా ఒక objectకు ఒకే పదం ఉండాలి. సాహిత్యంలోవాడే యమక, శ్లేషాది అలంకారాలు పారిభాషిక పదాలకు పనికిరావు.

పారిభాషిక పదాలు వీలయినంతమటుకు సంక్షిప్తంగా ఉండాలి. ఉపసర్గలు, ప్రత్యయాలు మొదలయిన వాటిని ఉపయోగించి, అదే అర్థానికి సంబంధించిన వేరువేరు పదాలుగా రూపొందించడానికి వీలుగా ఉండాలి. అంటే మూలపదం ఆధారంగా ఇతర పదాలను రూపొందించగలగాలి. ఉదా: Latin లో Tele అంటే దూరం అని అర్థం. దానిమీద ఆధారపడి Television, Telephone, Telegram మొదలయిన ఆంగ్లపదాలు ఏర్పడ్డాయి. అదేవిధంగా దూరదర్శన్, దూరభాషణ, తంతి మొదలయిన పదాలు మన భాషల్లో ఏర్పడ్డాయి. తెలుగులో 'తంతి' అనే పదం ఆధారంగా తంతి చిరునామా (Telegraphic address) తంతి కార్యాలయం (Telegraph office), తంతి మార్గం (Telegraph line), తంతి కేంద్రం (Telegraph station) మొదలయిన పదాలు ఏర్పడ్డాయి.

పారిభాషిక పదాలను అనువదించేటప్పుడు మూలభాషలో వాడిన పదాలను యథాతథంగా స్వీకరించాలా? లేదా కొత్తపదాలను రూపొందించుకోవాలా? అన్న సమస్య ఏర్పడుతుంది. సంస్కృత పదాలకు మూల సంస్కృతంలో ఉండే అర్థం, తెలుగులో ఉండే అర్థం అప్పుడప్పుడు వేరుగా ఉంటుంది. అదేవిధంగా కొన్ని ఇంగ్లీషు పదాలకు ఇంగ్లీషులోను, తెలుగులోను అర్థాలు వేరుగా ఉండటం కద్దు. ఉదాహరణకు Rails, sleepers మొదలయినవి. అందుకని కొంతమంది ఆయా శబ్దాలను, లక్ష్యభాష స్వభావానికి అనుగుణంగా మార్చుకొని స్వీకరించాలని అంటారు. మరికొంతమంది మూలభాషలోని పదాల అర్థాలకు అనుగుణంగా నూతనపదాలను రూపొందించుకోవాలి అని అంటారు. మరికొంతమంది అంతర్జాతీయంగా వాడుకలో ఉన్న పదాలను యథాతథంగా స్వీకరించుకోవాలి అని అంటారు.

పారిభాషిక పదాల అనువాదానికి సంబంధించిన సమస్యలను అధిగమించడానికి పారిభాషిక పదస్వరూప నిర్ధారణతోపాటు లక్ష్యభాషలో ఆయాపదాలను వాడటానికి ఉన్న అనుకూల్యతను కూడా దృష్టిలో పెట్టుకొని, మూలభాషలోని పదాలను యథాతథంగా స్వీకరించడమో లేదా వాటిని లక్ష్యభాష స్వభావానికి అనురూపంగా మార్చుకోడమో చేయాలి. పారిభాషిక పదాల విషయంలో తెలుగు అకాడమీ, Commission for Scientific and Technical Terms (భారత ప్రభుత్వం) మొదలయిన సంస్థలు తయారుచేసిన glossoriesను అనువాదకులు తప్పనిసరిగా సంప్రదించాలి. అప్పుడే అనువాదకుడు చేసే శాస్త్రీయ గ్రంథాల అనువాదం నిర్దుష్టంగా, ఆధికారికంగా ఉంటుంది.

అనువాదంలో పారిభాషికపదాల అర్థాలలో సందేహం ఏర్పడే అవకాశం ఉన్నదను కొన్నప్పుడు బ్రాకెట్లలో మూలభాషలో వాడిన పారిభాషిక పదాన్ని ఇవ్వడం సముచితంగా ఉంటుంది.

సారాంశం ఏమంటే శాస్త్రీయ వైజ్ఞానిక గ్రంథాల అనువాదంలో పారిభాషిక పదాల అనువాదం చాలా ప్రధానమైన సమస్య. దీనిని అనువాదకుడు చక్కగా అవగాహన చేసుకొని సందర్భానుసారంగా పారిభాషికపదాలకు లక్ష్యభాషలో నిర్దేశించిన పర్యాయపదాలనే వాడే అలవాటుచేసుకోవాలి.

# 13

# అనువాదం-కంప్యూటర్

విజ్ఞానశాస్త్రం దినదినాభివృద్ధి చెందడంతో మానవుడు తన సౌకర్యంకోసం ఎన్నో రకాల సాధనాలను, యంత్రాలను తయారుచేసుకున్నాడు. వాటన్నింటిలో చెప్పుకోదగ్గవి-రోబో, కంప్యూటర్లు. రోబో అనే యాంత్రిక మానవుడు సాధారణ మానవుడికి అసాధ్యాలైన ఎన్నో పనులు చేసి పెడుతున్నాడు. మేధావి అయిన శాస్త్రజ్ఞుడు దూరంగా తన గదిలో కూర్చొని రిమోట్ కంట్రోల్‌తో ఈ రోబోతో ఎన్నో పనులు చేయిస్తున్నాడు. ఈ రోబో నిర్మాణక్రమంలో ఇంకా ఎన్నో మార్పులు-చేర్పులు చోటుచేసుకోగలవని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. అయితే రోబోకి మేధస్సులేదు. అది స్వయంచాలితం (Auto) కాదు.

అదే విధంగా కేవలం లెక్కలు(caliculations) చేయడానికి ఆవిష్కరించిన కంప్యూటర్ లెక్కలు చేయడమే కాకుండా ఇంకా ఎన్నెన్నో పనులు చేసిపెడుతున్నది. మానవుడికి కష్టసాధ్యమైన ఎన్నో గుణకాలను, సమస్యలను కంప్యూటర్ క్షణాల్లో పరిష్కరించి పెడుతున్నది. అంటే శరీం శ్రమను రోబో తగ్గిస్తే, మెదడు శ్రమను కంప్యూటర్ తగ్గిస్తున్నది. నిత్యనూతన విషయాలను ఆవిష్కరించే అలవాటు ఉన్న మానవుడు కంప్యూటర్ చేత అనువాదం కూడా చేయించాలని ప్రయత్నం చేస్తున్నాడు.

అనువాదం అంటే ఒక భాషలో చెప్పిన భావాలను ఇంకో భాషలో తిరిగి చెప్పడం అని నిర్వచనంకదా! అంటే ఒక భాషలోని ప్రతీకల (symbols) స్థానంలో మరోభాషలోని ప్రతీకలను చెప్పడమే అనువాదం. ఈ పనిని కంప్యూటర్ చేత చేయించాలని 1933 నుంచి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. మొట్టమొదట కంప్యూటర్ చేత లిప్యంతరీకరణం (transliteration) చేయించారు. ఒక లిపిలోని రచనను యథాతథంగా మరో లిపిలో రాసే పద్ధతిని కంప్యూటర్ ద్వారా చేయించారు. కంప్యూటర్ మెయింటెనెన్స్ కార్పొరేషన్ (Computer maintainence corporation) వారు అనేక భాషలకు ఉపయోగపడే వర్డ్‌ప్రాసెసర్ (word processor ) ను రూపొందించి దానిచేత లిప్యంతరీకరణం చేయించారు. ఈ వర్డ్ ప్రాసెసర్ ద్వారా హిందీ-ఇంగ్లీషు, తదితర భాషల్లోకి లిప్యంతరీకరణ కార్యక్రమం చేపట్టవచ్చు.

జనవరి, 1954 సంవత్సరం యాంత్రిక అనువాద చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగింది.

ఆ సంవత్సరం' అనువాదం చేసే కంప్యూటర్‌ని ప్రదర్శించారు. ఆ యంత్రం గణితశాస్త్రానికి సంబంధించిన 60 రష్యన్ భాషా వాక్యాలను ఇంగ్లీషులోకి అనువదించగలిగింది. తరవాత 1958లో technical mathematical విషయాలను అనువదించే యంత్రాలను నిర్మించారు. 1963లో రష్యన్-ఇంగ్లీషు అనువాదం చేసే కంప్యూటర్‌ను తయారుచేశారు. ఆ తరవాత Thoshiba corporation వారు ఇంగ్లీషునుంచి జపాను భాషలో అనువదించగలిగే కంప్యూటర్‌ను నిర్మించారు. ఈ యంత్రాలు మనిషిచేసే అనువాదం కంటే మూడు రెట్లు వేగంగా అనువాదం చేయగలిగాయట. ఇలా ప్రపంచభాషల్లో పరస్పరం అనువాదాలు చేయడానికి కంప్యూటర్ సహకరిస్తున్నది.

ఈ సందర్భంలో Espiranto అనే Common Universal Language ని గురించి తెలుసుకోవాలి:

అనువాదం మూలరచనకు న్యాయం చేకూర్చలేదనే భావం కలగడంతో అన్నిదేశాలకు ఉపయోగకరంగా ఉండే అంతర్జాతీయ భాషను రూపొందించాలన్న ప్రయత్నం క్రీ.శ. 16వ శతాబ్దంనుంచే ప్రారంభమయింది. సంగీతం, గణితం, విజ్ఞాన శాస్త్రం మొదలయిన విషయాలలో పారిభాషిక పదాలు అంతర్జాతీయ గుర్తింపు పొందాయి. అంతర్జాతీయ భాషా నిర్మాణానికి కృషి చేసినవారిలో సర్‌ఫ్రాన్సిస్ బేకన్ అగ్రగణ్యుడు. ఆయన చైనాదేశపు చిత్రలిపి ఆధారంగా అంతర్జాతీయ లేఖనపద్ధతిని కూడా సూచించాడట. ఆ తరవాత కొంతమంది ఐరోపా విద్వాంసులు అంతర్జాతీయ భాషా నిర్మాణానికి ప్రయత్నాలు చేశారు. కాని వారి ప్రయత్నాలు అన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి.

డా.యల్.యల్. జామెన్ హాఫ్ అనే పోలండు దేశస్థుడు 1887లో 'ఎస్పరాంటో' అనే పేరుతో అంతర్జాతీయ భాషను నిర్మించాడు. సరళమైన వ్యాకరణ విధానం, ధ్వని సౌలభ్యం, భాషణ-లేఖన సామరస్యం, జెర్మానిక్, గ్రీకు, లాటిన్, రోమన్ పదసంపద ఈ భాషకుగల ముఖ్య లక్షణాలు. జెస్పర్సన్ కనిపెట్టిన 'నోవియల్' కూడా కొంచెమించుగా 'ఎస్పరాంటో'ను పోలినదే"[1] (ఆచార్య దివాకర్ల వేంకటావధాని).

వివిధ దేశాల జాతీయ భాషలకు సహాయకారిగా ఉంటూ, వాణిజ్యం, యాత్ర, ఎగుమతి దిగుమతులు, అంతర్జాతీయ సభాసమావేశాలు, ప్రపంచ ప్రభుత్వం మొదలయిన విషయాలలో వివిధ భాషలు మాట్లాడే వారికి పరస్పరం 'భాషా వినిమయ సాధనం'గా తోడ్పడటమే 'ఎస్పరాంటో' ప్రధాన ప్రయోజనం.

---

1. విజ్ఞాన సర్వస్వము - ఆరవ సంపుటము - పేజీ 82, 598-99

'ఎస్పరాంటో' మొదట పోలండు, రష్యాలనుంచి స్వీడెనులోని ఉప్సలా విశ్వవిద్యాలయం చేరింది. ఆ విశ్వవిద్యాలయం ద్వారా యూరపు ఖండానికి, తరవాత ప్రపంచమంతటా వ్యాపించింది. కాని కృతకంగా నిర్మించిన భాష అవడంతో దీని వ్యాపకం మెల్లమెల్లగా తగ్గిపోయింది. కాని జామెన్‌హాఫ్ చేసిన ప్రయత్నం ప్రశంసనీయమే అని చెప్పవచ్చు.

తరవాతి కాలంలో అనువాదకుడి కంఠస్వరం ఆధారంగా మూలభాష నుంచి లక్ష్యభాషలో అనువాదం చేసే కంప్యూటర్ కనిపెట్టారు. దానికి voice replying apparatus అని పేరు పెట్టారు. Canadaలోని Motrial లో జరిగిన ఒక ప్రదర్శనలో typed matter ని అనువాదం చేసి, దానిని ఉచ్చరించే యంత్రాన్ని కూడా ప్రదర్శించారు. 8వేల నుంచి 10 వేల పదాలదాకా అనువదించే సామర్థ్యం ఈ యంత్రానికి ఉంది.

ఈ మధ్యకాలంలో యంత్రానువాదం గురించి, University of Hyderabad లో విశిష్టమైన పరిశోధనలు జరుగుతున్నాయి. తెలుగు విశ్వవిద్యాలయం సహకారంతో 20 వేల పదాల (ఇంగ్లీషు-తెలుగు) కంప్యూటర్ నిఘంటువును తయారు చేశారు. దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఉచ్చశిక్షా ఔర్ శోధ్ సంస్థాన్ (పి.జి.కాంప్లెక్స్)లో ద్విభాషా నిఘంటువు (హిందీ-తెలుగు, తెలుగు-హిందీ) తయారు చేశారు. కాన్పూర్‌లోని I.I.T. లో కూడా ఇటువంటి ప్రయత్నమే జరుగుతున్నది. అయితే ఈ యాంత్రిక అనువాదాలు కేవలం నిఘంటు నిర్మాణానికి, కొన్ని పరిమితులకు లోబడి వైజ్ఞానిక విషయాల అనువాదానికిమాత్రం పనికి వస్తున్నాయి. ఎందుకంటే ఎంత Advanced అయినా, అది యంత్రమే. ఎంత స్వయంచాలితం (Auto) అయినా కొద్దో గొప్పో మానవ ప్రయత్నం లేకుండా అది పనిచేయదు. ఎంతైనా దానికి మానవుడి feeding అవసరమే!

భాష వాక్యాలతో, పదబంధాలతో, పదాల విశిష్ట ప్రయోగంతో ఏర్పడుతుంది. సంస్కృతిపరమైన అలంకార ప్రయోగాలతో, సాంస్కృతిక అంశాలతో కూడిన భాషా వైశిష్ట్యాన్ని ఎంతో కొంత నైపుణ్యం-అనుభవం ఉన్న అనువాదకుడే సంతృప్తికరంగా అనువదించలేక పోతున్నప్పుడు ఇక యంత్రాల మాటేమిటి? అయితే యంత్రం అనువాదానికి కావలసిన Basic material ను అతి సులభంగా అనువాదకుడికి అందచేయగలుగుతుంది. దాని సహాయంవల్ల అనువాదకుడి శ్రమ తగ్గుతుంది.

వైజ్ఞానిక విషయాలు నిశ్చితమైన నియమాల ననుసరించి ఉంటాయి. కాబట్టి సముచితంగా Feed చేసిన తరవాత, ఆ Programming ప్రకారం computer అనువాదం చేసి పెడుతుంది. కాని తరవాత దాన్ని Editing చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంటుంది. యంత్రం సొంతంగా

ఆలోచించి మూల భాషలోని భావాన్ని యథాతథంగా లక్ష్యభాష పాఠకుడికి అందించ లేదు. ఉదా:- sleep నుంచి వచ్చిన మాట sleeper. కాని Railway రంగంలో sleeper అంటే Rail పట్టాల కింద వేసే అడ్డచెక్క. ఒకానొక అనువాదకుడు "Ten thousand sleepers have been swept away by floods" అనే వాక్యానికి 'వరదల మూలాన పదివేల మంది నిద్రిస్తున్నవారు కొట్టుకొపోయారు" అని అనువాదం చేశాడు. మరి ఈ సూక్ష్మ భేదాన్ని యంత్రం ఎలా గుర్తించగలుగుతుంది? అలాగే woodకి అర్థం వేరు. woods కి అర్థం వేరు. good కి అర్థం వేరు. goods కి అర్థం వేరు కదా! సందర్భోచితంగా వాడే ఈ పదాలలో ఉండే అర్థభేదాన్ని యంత్రం గ్రహించలేదు. కాబట్టి అనువాదకుడికి అనువాద కార్యంలో సహకరించే సాధనంగా కంప్యూటర్‌ని పరిగణించవచ్చుగాని అది అనువాదకుడి స్థానాన్ని పూరించలేదు. ఎందుకంటే కేవలం పదానువాదమే అనువాదం కాదని గుర్తుపెట్టుకోవాలి. పదాలు విశిష్టపదప్రయోగశైలిలో విశిష్టమైన అర్థాలను, భావాలను అభివ్యక్తీకరిస్తాయి.

అయితే కంప్యూటర్ సహాయంతో చక్కటి నిఘంటువులు (ద్విభాషా, త్రిభాషా మొదలైన కోశాలు) తయారుచేసుకోవచ్చు. అలా కంప్యూటర్-నిఘంటువులు అనువాదకుడు పేజీలు తిరగవేసే శ్రమను తగ్గించగలవు. ఇతర భాషా పదాలు సులువుగా, తొందరగా అందుబాటులో రావడానికి కంప్యూటరు సహాయ సహకారాలు ప్రస్తుత యంత్రయుగంలో అనువాదకుడికి అత్యవసరం.

# అనువాదం-పునఃపరిశీలన

సృజనాత్మక రచయిత తన హృదయ స్పందనలను లిపిబద్ధంచేసుకుంటూ పోతాడు. తన హృదయంలోని భావాలను కావ్యరూపంగానో, వచనరూపంగానో ధారాప్రవాహంగా అభివ్యక్తీకరించే రచయితకు వెనుదిరిగి చూడవలసిన అవసరం ఉండదు. కాని అనువాదకుడు మూల రచయిత భావాలను ఆకళింపు చేసుకొని, వీలయినంతమటుకు సమతుల్యంగానూ, లక్ష్యభాషా స్వభావానికి సహజంగానూ అభివ్యక్తీకరించాలని ప్రయత్నంచేస్తాడు. కాబట్టి మూలభావాన్ని, మూలంలోని పదప్రయోగశైలిని యథాతథంగా పునఃసృజించగలిగానా లేదా అని వెనుదిరిగి పరిశీలించుకోడం అనువాదకుడికి అవసరం. మాతృభాష అయినా, పరభాష అయినా లక్ష్యభాషలోకి అనువదిస్తున్నప్పుడు మూలంలోని పద ప్రయోగాల ప్రభావాన్ని పరిహరించుకోడానికి, మాతృభాష అయిన మూలభాష నుంచి ఇతర భాషలలోకి అనువదిస్తున్నప్పుడు మూలభాషా ప్రభావాన్ని పరిహరించడానికి పునఃపరిశీలన అత్యవసరం. ఈ ప్రక్రియను ఇంగ్లీషులో vetting అని, హిందీలో పునరీక్షణ్ అని అంటారు.

మూలంలోని భావాలను పూర్తిగా అర్థంచేసుకొని, వాటిని వీలయినంతమటుకు యథాతథంగా లక్ష్యభాషలో అభివ్యక్తీకరించగలిగానా లేదా? అని అనువాదకుడు తాను చేసిన అనువాదాన్ని పునఃపరిశీలించుకోవాలి. తాను చేసిన అనువాదాన్ని మళ్ళీ చదువుకున్నప్పుడు స్వయంగా తనకే ఇటువంటి కొన్ని లోపాలు కనిపించే అవకాశం ఉంటుంది. శబ్దం, వాక్యంమీద మనస్సు కేంద్రీకరించి, అనువాదం చేసుకుంటూ పోతున్నప్పుడు మూలంలోని భావం లక్ష్యభాష స్వభావానికి అనుగుణంగా ఉండకపోవచ్చు. పునఃపరిశీలన చేసుకున్నప్పుడు అటువంటి విషయాలను గమనించి సరిదిద్దుకోడానికి అనువాదకుడికి అవకాశం కలుగుతుంది.

పునఃపరిశీలనవల్ల ఏవైనా పొరపాట్లు దొర్లిఉంటే వాటిని పరిష్కరించుకోడానికి అవకాశం లభిస్తుంది. తనుచేసిన అనువాదం లక్ష్యభాష స్వభావానికి అనుగుణంగా, సహజంగా సాఫీగా సాగిపోయిందా లేదా అని పరిశీలించుకోడానికి కూడా అవకాశం ఉంటుంది. అనువదిస్తున్నప్పుడు, ఎంత అనుభవజ్ఞుడైనా, ఎంత నైపుణ్యం గలిగినవాడైనా, అనువాదంలో మూల భాషా ప్రభావం అంతో, ఇంతో ఉండకతప్పదు. మూలాన్ని తీసి పక్కనబెట్టి అనువాదాన్నిసాఫీగా చదువుకుంటూపోతే, ఇటువంటి దోషాలను పొరపాట్లను నివారించుకోవచ్చు.

చేసిన అనువాదాన్ని పునఃపరిశీలించుకొనేటప్పుడు కొన్ని ప్రశ్నలు వేసుకోవాలి:

1. మూలంలోని అర్థం -భావం- పూర్తిగా అనువాదంలో అభివ్యక్తమైందా? లేదా?

2.మూలంలోని శైలి, పదప్రయోగాలు, వాక్య నిర్మాణవైఖరి మొదలయిన వైశిష్ట్యాలు అనువాదంలో వచ్చాయా లేదా?

3.మూల రచయిత ఉద్దేశం, అభిమతం మొదలైనవి అనువాదంలో ప్రస్ఫుటంగా వచ్చాయా లేదా?

ఈ ప్రశ్నలు వేసుకొని అనువాదకుడు తన అనువాదాన్ని పునఃపరిశీలించుకుంటే అనువాదం చాలా మటుకు దోషరహితమై ప్రభావోత్పాదకంగా ఉంటుంది.

Dr. Gunther అనే విద్వాంసుడు ఒక అనువాదాన్ని పరిశీలించేటప్పుడు కింద చెప్పిన నియమాలను ఏర్పరచుకోవాలని చెప్పాడు.

1. Draw up a set of rules of quality.
2. Ascertain the quality of the work.
3. Point out the errors according to the rules.
4. Analyse and improve the quality .[1]

కొంతమంది విద్వాంసులు పునఃపరిశీలన అనేది స్వయంగా అనువాదకుడు కాకుండా మరొకరు చేస్తే బాగుంటుందని అభిప్రాయపడుతున్నారు. ఎంతవారికైనా తమ తప్పులు తమకు కనబడకపోవడం స్వాభావికమేకదా! అందుచేత ఇతరులు పునఃపరిశీలనచేస్తే అనువాదం ఇంకా దోషరహితంగా ఉంటుంది. అందుకనే భారతీయ జ్ఞానపీఠ్ వంటి ప్రఖ్యాత సంస్థలు మూలభాష మాతృభాషగా, లక్ష్యభాషలో ప్రావీణ్యం ఉన్న అనువాదకుడికి సహకారం అందించడానికి లక్ష్యభాష మాతృభాషగా ఉన్న పరిష్కర్తను నియమిస్తారు. దానివల్ల మూలభాషలోని అర్థగాంభీర్యం చెడిపోదు. అనువాదం లక్ష్యభాషా స్వభావానికి అనుగుణంగా ఉంటుంది.

తెలుగు అకాడమీ వారు విజ్ఞాన శాస్త్రగ్రంథాలను అనువదింపచేస్తున్నప్పుడు విషయ పరిజ్ఞానం ఉన్న నిపుణుడికి (subject expert) భాషా నిపుణుడి (Language expert) సహకారం అందిస్తారు. తద్వారా అటు విషయంలో, ఇటు భాషలో పొరబాట్లు దొర్లకుండా ఉంటాయి.

కేంద్ర సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్‌ట్రస్ట్, మాస్కోలోని ప్రగతి ప్రచురణాలయం, ఓరియంటల్ లాంగ్‌మన్ వంటి సుప్రసిద్ధ ప్రచురణ కర్తలు ప్రతి అనువాదానికి తప్పనిసరిగా ఒక పరిష్కర్తను నియమిస్తారు. దానివల్ల అనువాదం, విషయం, శైలి (matter and manner) దృష్ట్యా దోషరహితంగాను, సుపాఠ్యంగాను ఉంటుంది. అనువాద ప్రక్రియలో పునఃపరిశీలనకు ఎంతో ప్రాధాన్యం ఉంది.

---

1. వ్యావహారిక్ అనువాద్ -డా.ఎన్.ఈ. విశ్వనాథ అయ్యర్ - పేజీ 52

# అనువాదనీయత

పదానువాదం అనువాదం కాదు. మూల రచనలోని భావసౌందర్యాన్ని, దాన్ని అభివ్యక్తీకరించే పదగుంఫనాన్ని అర్థంచేసుకొని ఆ భావ సౌందర్యాన్ని, వీలయినంత మటుకు ఆ పదప్రయోగ వైచిత్రిని లక్ష్య భాష పాఠకుడికి అందించటమే అనువాదకుడి ధ్యేయం అయి ఉండాలి. ఒక భాషలోని భావసౌందర్యం, పద ప్రయోగ పద్ధతి (matter and manner) ఈ రెండూ విశిష్టమైన చరిత్ర, సంస్కృతి, రచనా సంప్రదాయం, కావ్యశాస్త్రం మొదలైన వాటిమీద ఆధారపడి ఉంటాయి. ఆ సంస్కృతి, ఆ సంప్రదాయం లక్ష్యభాషలో ఉండకపోవచ్చు. ఉదాహరణకు పాశ్చాత్య సాహిత్యంలో Blue eyes అందానికి చిహ్నాలు. అయితే మనకు 'కాటుక కళ్ళు' అందానికి ప్రతీకలు. అనువాదకుడు Blue eyes కి బదులుగా నల్లని కళ్ళు అని అనువదించాలి. Warm welcome అనేది చలిదేశాలకు అనుకూలంగా ఉంటుంది. Warm welcome ను 'ఉష్ణ స్వాగతం' అనకుండా 'హృదయపూర్వక స్వాగతం' అని అనువదించాలి. 'See you again' అనేదానికి 'వెళ్ళివస్తాను' అని అనవచ్చు. ఇటువంటి చోట్ల శబ్దాన్ని కాకుండా భావాన్ని అనువదించి అనువాదకుడు నిర్దిష్ట ప్రయోజనాన్ని సాధించగలడు. సంస్కృతిపరమైన, జీవన విధానానికి సంబంధించిన విషయాలను అనువదించడం కష్టం.

తెలుగు భాషలో బావ అనే పదానికి ఉన్న భావ సౌందర్యం మాతుల సంబంధం (మేనరికం) మీద ఆధారపడి ఉంది. మేనరికపు సంబంధాలు ప్రచారంలోలేని చోట్ల వ్యవహారంలో ఉన్న భాషల్లో 'బావ' పదాన్ని అనువదించటం దుస్సాధ్యం. బావ అనే పదం సంబంధసూచకమేకాక శృంగారాన్ని కూడా సూచిస్తుంది. అలాగే తెలుగు సంస్కృతికి చెందిన 'పూటకూళ్ళవ్వ', 'వారాలబ్బాయి' లాంటి పదాలు మరో భాషలోకి అనువదించలేం.

ఇంటిముంగిట్లో కళాపి చల్లి, ముగ్గులు వేయడం అనే ఆచారం తెలుగునాట బహుళ ప్రచారంలో ఉంది. అలాగే సాతానిజియ్యరు, గంగిరెద్దుమేళం, కోడిపందేలు, సంక్రాంతి పండగ విశేషాలు మొదలైనవి తెలుగు సంస్కృతికి పట్టుగొమ్మలు. సంక్రాంతి రోజుల్లో (ఉత్తరాయణ ప్రవేశం) చలికి గజగజవణికిపోయే ఉత్తర భారతదేశ సాహిత్యాలలో ఈ పండగ విశేషాలు లేకపోవడంతో, తత్సంబంధమైన పదాలు ఆ భాషల్లో కనిపించవు. ఆయా పండగలకు సంబంధించిన మాటలను ఎంతగా వివరించినా, ఆయా భాషలవారు ఆకళింపు చేసుకోలేరు.

ఒకానొక రచయిత గోంగూర పచ్చడిలో ఉల్లిపాయ తాళింపు వాసనను వర్ణించాడు.

ఈ స్వారస్యాన్ని తెలుగువాడు ఆనందించగలుగుతాడేకాని ఇతర భాషల వారికి గోంగూర పచ్చడీ తెలియదు, దాంట్లోకి ఉల్లిపాయల తాళింపును గురించి అసలే తెలియదు.

ఇటువంటి సమస్యలు ఒకే సంస్కృతికి చెందిన సజాతీయమైన భాషలలోనే అనువాదానికి లొంగవు. విశిష్ట సంస్కృతి పరమైన ఇటువంటి పదాలు విజాతీయ భాషల్లోకి అనువదించడం దుస్సాధ్యం.

భాషాప్రయోగాలు ఆయా ప్రాంతాల శీతోష్ణస్థితులు, భౌగోళిక పరిస్థితులు, పరిసరాలు, మతం-మతవిశ్వాసాలు, ఆచార-వ్యవహారాలు మొదలయిన వాటి మీద ఆధారపడి ఉంటాయి. ప్రతిభాషకు తనదంటూ ఒక అభివ్యక్తి పద్ధతి, ఆ అభివ్యక్తికి తగిన సామర్థ్యం ఉంటుంది. ఆయా భాషలకు వర్తించే నియమాలు వేరే భాషలకు వర్తించవు.

ఒక జాతి సంస్కృతిని బట్టే ఆ జాతి సాహిత్యం కూడా ఉంటుంది. ఆ సాహిత్యంలో ఆ సంస్కృతి వైశిష్ట్యాన్ని వ్యక్తీకరించే ఎన్నో విషయాలు, పదాలు ఉంటాయి. ఆ సాహిత్యం, ఆ భాష పాఠకుణ్ణి ఎంతగానో ఆకట్టుకోవచ్చు. కాని ఆ సంస్కృతీ వైశిష్ట్యంతో పరిచయం లేనివారికి ఎబ్బెట్టుగా అనిపించవచ్చు. కాబట్టి మూలభాషలోని అన్ని రచనలు ఇతర భాషలలోకి అనువదించదగినవిగా ఉండకపోవచ్చు. సంస్కృతికి సంబంధించిన పదాలు, మాండలికాలు, ప్రతీకలు మొదలైన వాటిని ఇతర భాషలలోకి అనువదించలేం. సార్వజనీనమైన, సార్వకాలికమైన భావాలను అభివ్యక్తీకరించే భావాలను ఇతర భాషల్లోకి అనువదించవచ్చు. కాని సాంస్కృతిక, ప్రాదేశిక, మాండలిక వైశిష్ట్యాలను, ఆచార వ్యవహారాలను అనువదించడం కష్టసాధ్యం, సమంజసం కూడాకాదు. విశ్వకవి రవీంద్రుడు రచించిన 'కాబూలీవాలా'లో వ్యక్తమైన పితృహృదయం సార్వదేశికం, సార్వకాలీనం. కాబట్టే ఆ కథ ఇతర భాషల్లోకి అనువాదం అయి విశ్వవిఖ్యాతి పొందింది. కీర్తిశేషులు పాలగుమ్మి పద్మరాజు రచించిన 'గాలివాన' అంతర్జాతీయ బహుమతి పొందడానికి ఇలాంటి సార్వదేశిక, సార్వకాలిక అనుభూతులే ప్రధానంగా స్వీకరించబడ్డాయి.

డా. బూదరాజు రాధాకృష్ణ గారన్నట్లు 'కొన్ని రకాల రచనలు అనువాదానికి సాధ్యపడవు. ఉదాహరణకు వేదమంత్రాలను మరే భాషలోకి అనువదించలేం కదా![1]

కేవలం శబ్దప్రయోగ వైచిత్రిమీద ఆధారపడిన రచనలను ఆమోదయోగ్యంగా అనువదించలేం. అనువాదంలో అనువాదకుడి ప్రతిభనుబట్టి భావసౌందర్యాన్ని వ్యక్తీకరించగలం కాని శబ్దసౌందర్యాన్ని యథాతథంగా అనువదించలేం. అనువాదంలో కూడా కొన్ని పరిమితులున్నాయని గ్రహించి తదనుగుణంగా అనువాదకుడు అనువాదం చేయాలి. కాబట్టి ఒక రచన అనువాదయోగ్యమా కాదా? అని ఆలోచించి ఆ రచనను అనువదించడానికి పూనుకోవాలి.

---

1. అనువదించడం ఎలా? - శ్రీ గోవిందరాజు చక్రధర్ - పేజీ. 106

# 16

# ముగింపు

ప్రాచీనకాలంనుంచి అనువాదాలకు తగినంత విలువ ఉన్నప్పటికీ, ఈ శతాబ్దాన్ని 'అనువాదయుగం' అనడం అతిశయోక్తి కాదు. మానవ విజ్ఞానం పలుముఖాలుగా, పలుదిశలుగా విస్తరిస్తున్న ఈకాలంలో ప్రతిభాషలోను, ప్రాచీనసాహిత్యపు ఉత్కృష్ట రచనలతో పాటు ఆధునిక సభ్యత, సంస్కృతి, సంస్కారాలను అభివ్యక్తీకరించే రచనలు వెలువడుతున్న ఈ కాలంలో ఇతరేతర భాషల్లో ప్రచురితమవుతున్న విజ్ఞానాన్ని, సాహిత్యాన్ని అందిపుచ్చుకోవాలని ఉవ్విళ్ళూరుతలూగడం మానవ సహజం. ఏదేశస్థుడో విజ్ఞానశాస్త్రంలో ఏదో కొత్తవిషయాన్ని ఆవిష్కరిస్తే ప్రపంచంలోని అన్ని దేశాల వైజ్ఞానికులు దానిని గురించి తెలుసుకోవాలని ఆశిస్తున్నారు. ఏదోఒక భాషకు చెందిన రచయితకు నోబుల్‌బహుమతి లాంటి విశిష్టబహుమతులు ప్రకటించినప్పుడు ఆ రచయిత రచనా వైశిష్ట్యాన్ని గురించి తెలుసుకోవాలని సాహిత్యాభిరుచి ఉన్న ప్రతి వ్యక్తి ఆశిస్తున్నాడు. మరి మానవుడు వందలాది భాషలు నేర్చుకోలేడు గదా! అప్పుడు అనువాదమే అతని విజ్ఞాన తృష్ణను, సాహిత్యపిపాసను తీర్చడానికి ఏకైక సాధనం అవుతుంది. ప్రపంచదేశాల మానవులను పరస్పరం సన్నిహితులను చేసే ఆత్మీయబంధం అనువాదం. జ్ఞానమే లేకపోతే ప్రపంచమంతా చీకట్లో మునిగిపోయి ఉండేదన్న ప్రాచీనుల సూక్తిని ఈనాటి కాలానికి అనుగుణంగా అనువాదాలే లేకపోతే నేటి ప్రపంచం అజ్ఞానతిమిరంలో ఉండిపోయేది అని నిస్సందేహంగా చెప్పవచ్చు. అందుకనే సుప్రసిద్ధ పాత్రికేయులు, సంపాదక శిరోమణులు అయిన శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుగారు అనువాదాన్ని 'విశ్వవారధి'గా అభివర్ణించారు. వారన్నట్లు 'వేలాది భాషలు మాట్లాడుతున్న సమస్త మానవాళిని ఏకంచేసి వసుధైక కుటుంబాన్ని సాధించగల శక్తి అనువాద విద్యకు ఉన్నది.' 'అనువాదం మనుషుల మధ్య భాషాసంబంధమైన అడ్డుగోడల్ని కూలుస్తుంది. విజ్ఞానాన్ని పెంచుతుంది. అలా మానవుడి సర్వతోముఖ వికాసానికి దోహదం చేస్తుంది.[1]

తన మనస్సులోని భావాన్ని అభివ్యక్తీకరించడం మానవ స్వభావం. ఆ భావ వ్యక్తీకరణకు ఏకైక సాధనం భాష. అనేక భాషల్లో అభివ్యక్తమైన మానవ భావాలలోని సమైక్యతను, భావంలోను, భావవ్యక్తీకరణలోను ఉన్న సమానత్వాన్ని గుర్తింపచేయగల ఏకైక సాధనం అనువాదం.

---

1. అనువదించటం ఎలా? శ్రీ గోవిందరాజు చక్రధర్ - పేజీ 7, 12

ఇతరభాషలనుంచి తన మాతృభాషలోకి వచ్చిన అనువాదాలను అధ్యయనం చేసినందువల్ల మౌలిక రచయిత తన భావాభివ్యక్తీకరణను కొత్తపుంతలు తొక్కించి తన మాతృభాషకు అభివ్యక్తీకరణ శైలిలో కొత్తబలాన్ని సంతరించగలుగుతాడు.[1] ఈవిధంగా ఆలోచించిన కొద్దీ నేటియుగంలో అనువాద ప్రక్రియకు ఉన్న అవసరం; ఉపయోగం సుస్పష్టమవుతుంది.

ఐక్యరాజ్యసమితిలో ప్రపంచంలోని అన్ని దేశాలకు సభ్యత్వం ఉంది. ప్రతి సభ్యుడికి తన భాషలో మాట్లాడే హక్కు ఉంది. కాని అక్కడ ప్రపంచంలో ఎక్కువగా మాట్లాడే ఐదుభాషలకు మాత్రమే ఆశుఅనువాదం జరుగుతుంది. ఎవరు ఏభాషలో మాట్లాడినా, తక్షణమే ఆయాభాషలకు చెందిన అనువాదకులు వెంటనే అనువాదం చేసి వినిపిస్తారు. శ్రోత ఏభాషలో అనువాదం వినదల్చుకుంటే, ఆభాష అనువాదాన్ని వినవచ్చు. దీనివల్ల సభ్యుడు చెప్పదలుచుకున్న విషయం వెంటనే అర్థమై పోతుంది. ఆ తరవాత వివరాలు తెలుసుకోడానికి అచ్చు ప్రతులు లభ్యమౌతాయి. ఈ విధంగా అనువాదం ద్వారా ఐక్యరాజ్యసమితి సమావేశంలో ఉన్న సభ్యులందరికి అన్ని భాషలు రాకపోయినా ప్రముఖమైన ఐదు భాషల్లో వినిపించే ఆశుఅనువాదాల వల్ల విషయాన్ని అర్థం చేసుకొనే అవకాశం కలుగుతుంది. ఈవిధంగా అనువాదం విశ్వశాంతికి ఎంతగానో తోడ్పడుతుంది.

అదీగాక మనదేశంలాంటి బహుభాషలు వ్యవహారంలో ఉన్నచోట అనువాదం ఎంతో ప్రాముఖ్యం సంతరించుకుంటుంది. ప్రాచీనకాలం నుంచి సంస్కృతం, పాళీ, ప్రాకృతభాషలు, హిందీ-హిందుస్థానీ భాషలు, ఇంగ్లీషు మొదలైన భాషలు దేశానికంతటికి అనుసంధాన భాషలుగా (Link language) ప్రధానపాత్ర పోషిస్తూ వస్తున్నాయి. అయితే ఒక భాషలోని రచన ఇతర భాషల్లోకి అనువాదమైతేనే ఆయా ప్రాంతీయ భాషల పాఠకులకు సులభగ్రాహ్యమవుతుంది. అందుచేతనే సాహిత్య అకాడమీ, నేషనల్‌బుక్‌ట్రస్ట్ లాంటి జాతీయ సంస్థలు అనువాదకార్యక్రమాన్ని ఇతోధికంగా ప్రోత్సహిస్తున్నాయి.

అనువాద ప్రాధాన్యాన్ని గురించి చెబుతూ సుప్రసిద్ధ కవులు, సమాలోచకులు అయిన శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు 'అనువాదం ఆధునిక ప్రపంచ సాహిత్య నాగరకత' అని అన్నారు[2].

సాహిత్య వైజ్ఞానిక రంగాలలోనే కాకుండా రోజువారీ సాంఘికరంగంలో కూడా అనువాదానికి ఎంతో ప్రాధాన్యం ఉంది. రోజువారీజీవితంలో ఏర్పడే అనువాద ప్రయోజనాన్ని informal అని అంటారు. ముఖ్యంగా రెండు భాషాప్రాంతాల సరిహద్దులలో ఉండేవారికి అనువాద ప్రయోజనం

1. Translation allows the possibility of a new work of Art in the new language. (Target language) and this has not infrequently happened-An everyman's Encyclopedia.
2. కాలరేఖలు - తులనాత్మక సాహిత్యం . పేజీ 47

చాలా ఎక్కువ. అనువాదాలు వింటూ వింటూ ఒకరిభాష మరొకరికి రావడం మామూలే.అందుచేతనే భాషల సరిహద్దు ప్రాంతాలలో ఉండేవారికి రెండుభాషలు సునాయాసంగా వచ్చేస్తాయి.

మరొక భాష నేర్చుకోదలచినప్పుడు అనువాద పద్ధతి ప్రాధాన్యాన్ని సంతరించుకుంటుంది. భాషాబోధనలో (Language teaching) అనువాదం ద్వారా భాషను నేర్పించడాన్ని indirect method అంటారు. ఈపద్ధతివల్ల మాతృభాష కాని ఇతరభాషలు (second language) నేర్చుకోడం సులువు అవుతుంది.

రెండుభాషలను, వాటి సాహిత్యాలను, సంస్కృతులను పరస్పరం తులనాత్మకంగా పరిశీలించడానికి కూడా అనువాదమే సహాయకారి అవుతుంది. ఇలాంటి తులనాత్మక పరిశీలన, తులనాత్మక అధ్యయనం వల్ల పరస్పరం ఉండే విద్వేషాలు, అభిప్రాయభేదాలు సమసిపోయి జాతీయ సమైక్యతకే కాకుండా విశ్వమానవ సౌభ్రాతృత్వానికి కూడా అవకాశం కలుగుతుంది. ఇతర భాషలను గురించి ఆయాభాషల్లో ఉన్న సాహిత్యాన్ని గురించి తెలుసుకొంటే జాతీయ సమైక్యతా భావానికి బలం చేకూరుతుంది. అందుచేతనే రాధాకృష్ణ పండితుడు "The scripts are different but the soul is the same" అని అన్నాడు. భాషలు వేరైనా మానవ హృదయస్పందనలు ఒకటే. వారి హృదయాలలో మెసలాడే భావాలు ఒకటే. ఈసమైక్యతా భావాన్ని సుస్పష్టంగా తెలుసుకోడానికి అనువాదమే ఏకైక సాధనం.

# ఆధార గ్రంథాలు


## ఇంగ్లీషు

1. a) Towards a science of Translation - Nida Eugene A - Lieden, 1964

   b) The Theory and practice of translation - Nida & Charles R Taber-Liedan, 1974
2. The Problems of Translation, Ed. Prof. G. Gopinathan & Dr. Kandaswamy Lokbharati Prakashan, Allahabad, 1993.
3. CALTS working papers Vol. I - Ed. P.R. Dadegaonkar & G. Umamaheswara Rao - Centre for Applied Linguistics and Translation studies, Uni. of Hyderabad, Hyderabad, 1990
4. The Art of Translation - Theodore Savory-London 1957.
5. On Translating Kalidasa - Sri Aurabindo - Collected works of Sri Aurabindo.

## హిందీ

1. అనువాద విజ్ఞాన్: డా. భోలానాథ్ తివారీ - శబ్దకార్, తుర్కమాన్‌గేటు, ఢిల్లీ -6, 1992
2. వ్యావహారిక్ అనువాద్-డా. విశ్వనాథ అయ్యర్-ప్రతిభా ప్రతిష్ఠాన్, న్యూఢిల్లీ -2, 1998
3. అనువాద సిద్ధాంత్ కీ రూప్‌రేఖా - డా. సురేశ్‌కుమార్ - వాణీప్రకాశన్, న్యూఢిల్లీ-2, 1986
4. అనువాద్ (త్రైమాసపత్రిక)-భారతీయ అనువాద పరిషత్తు, న్యూఢిల్లీ

## తెలుగు

1. అనువాద సమస్యలు - కీ.శే. రాచమల్లు రామచంద్రారెడ్డి
2. అనువాదం చేయడం ఎలా? - శ్రీ గోవిందరాజు చక్రధర్ - Media House Publications, Vidyanagar, Hyderabad - 500 044. - 1998
3. కాలరేఖలు - శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ - తెలుగు అకాడమీ, హైదరాబాదు.
4. ఆంధ్ర మహాభారతం (అరణ్యపర్వం)-సం. డా. పాటిబండ మాధవశర్మ. ఆం.ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1971
5. విజ్ఞాన సర్వస్వం - ఆరవ సంపుటం - తెలుగు భాషా సమితి.